Photo by T. S. Satyan



బహుమతి
పొందిన వ్యాఖ్య

శ్రీరాముని దయచేతను...

పంపినవారు :
ఎస్. అమ్మాజమ్మ - వాల్తేరు

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక చిత్ర కథ, ఫొటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.


## అశోకా ఫ్లవర్ ఆఫ్ హెవెన్ టాల్కాం పౌడరు అండ్ స్నో




గగన కుసుమమువంటి ఈ అపూర్వ సౌందర్యోపకరణములు, విజయ కెమికల్సువారి సుదీర్ఘ పరిశోధనా ఫలితముగా తమకు లభించుచున్నవి. నవీనమయిన కెమికల్సువల్ల, పరిమళ ద్రవ్యములవల్ల అత్యుత్తముగా తయారైనవి. వీటి ఉపయోగమువల్ల మీ సౌందర్యమును, ముఖవర్చస్సును, యినుమడింపచేయును. ఉపయోగించిన అతి శీఘ్రకాలములోనే వీటి గుణములు మీరు గమనించగలరు. నేడే ఉపయోగింపుడు.

విజయా కెమికల్స్,
మద్రాసు-7.

ఏజంట్లు: గుడ్ విల్ ఏజన్సీస్, బెజవాడ.



ప్రతి మర్ఫీ రేడియో సెట్టు మీ గృహానికి మరింత ప్రతిష్ఠ చేకూర్చటానికి నిర్మించబడింది. ....ఏళ్లతరబడి మీకు మధురగానం వినిపించటానికి సృష్టించబడింది!

*All keyed up!*

# murphy

ఈనాటి అత్యంత ప్రియమైన రేడియో!



**SOUNDS GOOD! LOOKS GOOD!**

మోడెల్ 254

* 6-వాల్వ్ 4-బాండు * ఏసి అండ్ ఏసి/డిసి (2 మోడల్సు) * రు. 390
లోకల్ టాక్సులు అదనం

దక్షిణ ఇండియాలో సోల్ ఏజంట్లు | మహమద్ ఇబ్రహిం అండ్ కో., ప్రైవేట్ లి.,
7/8, మౌంట్ రోడ్డు, మద్రాసు-2 — బ్రాంచి: బెంగళూరు.

# THE CHOICE Pencils




**AJANTHA**
BLACK LEAD

**EMBESEE**
BLACK LEAD

**IMPERIAL**
COPYING

**ACCOUNTANT**
COLOUR

**CHECKING**
COLOUR

**SPECTRUM**
12, COLOURS

*Manufactured by*
**THE MADRAS PENCIL FACTORY**

3, STRINGER STREET,
MADRAS.

## నేడే చూడండి!







అరుణా ఫిలిమ్స్ వారి

# బొమ్మల పెళ్లి

శివాజీగణేశన్ · నాగయ్య · రంగారావు
నల్లరామమూర్తి · రమణారెడ్డి .....
జమున · శాంతకుమారి ..............
ఋష్యేంద్రమణి · మైనావతి ......

దర్శకత్వం:
**R.M.కృష్ణస్వామి**

నిర్మాతలు:
M.రాధాకృష్ణన్ · R.M.కృష్ణస్వామి




PARTHAN,

విజయా పిక్చర్స్ రిలీజు




రిజిస్టర్డు నం: 119923

## డైమండ్ సుగంధవక్క పొడి

### ఉపయోగించువారికి గమనిక

మా 'డైమండ్' మార్కు సుగంధవక్కపొడి అతి రుచికరమైనది, అన్ని విధాలా మిక్కిలి ప్రసిద్ధిచెందినదిన్నీ. మీరు ఈసారి వక్కపొడి కొనేటప్పుడు—"మాకు 'డైమండ్' మార్కు సుగంధవక్కపొడి కావాలి. అదే ఇవ్వండి. ఇతరములు ఏవీ వద్దు" అని కచ్చితంగా చెప్పి, అడగండి.

## ది డి. పి. అండ్ కంపెని,

### కౌల్‌బజార్ - బళ్ళారి - 1.

: సేల్సు డిపోలు :

చీరాల - గుంటూరు - కర్నూలు - ఆదోని - హుబ్లి.

# ఫిబ్రవరిలో విడుదల !


శ్రీరాజరాజేశ్వరీ
ఫిలిం కంపెనీ వారు
ఆంధ్రప్రజానీకానికి
సమర్పించు సాంఘిక
చిత్రం

అన్నతమ్ముడు

యన్.టి.రామారావు, జగ్గయ్య, రేలంగి, ముక్కామల,
కుటుంబరావు, కోటేశ్వరరావు, R.నాగేశ్వరరావు,
జానకి, రాజసులోచన,
మాలతి, గిరిజ.

మాటలు
పినిశెట్టి శ్రీరామమూర్తి. బి.వి.ఎస్.ఆచార్య * సంగీతం అశ్వత్థామ
దర్శకత్వం.. సి.యస్.రావు.

నిర్మాత.. కడారు వెంకటేశ్వరరావు M.A., B.L. * చమ్రియా రిలీజ్.



7 గంటలకు

నేటి ఉదయం

టీ సేవించి

నిత్యోత్సాహంతో

పని ప్రారంభించండి



నేను టీని-

మీ మనస్సు
బాగా వున్నపుడు,
లేనపుడు కూడా
నేను మీకు
చిర మిత్రుడను

PST 180




# ఇది నిక్కము...



...పగిలిన పాత్ర, నీటిని మంచి
పాత్ర ఉంచినట్లు నిలవుంచదు,
శిరోజ రంగుతో నలుపుచేయబడిన
శిరోజముల నలుపు లోమాతో
చేయబడినట్లుగా నిలవుండదు,

శిరోజరంగు శిరోజరములను
పైపైని మాత్రమే నలుపుచేయును,
లోమా శిరోజములను సహజంగా నలుపుచేయును.



జగత్ప్రసిద్ధమైన వెండ్రుకలను సహజంగా నలుపు చేయునట్టిది.

హోల్ సెల్లర్లు: ఎమ్. ఎమ్. అంభర్‌వాలా అహమదాబాద్ 1

ఏజంట్లు :

సి. నరోత్తమ్ అండ్ కో.,
బొంబాయి - 2.

★

ఢిల్లీ మెడికల్ స్టోర్సు, ఢిల్లీ.

★

షాహ బవిషి అండ్ కో.,
రాధాబజార్ స్ట్రీట్, కలకత్తా.

★

జె. బలాభాయ్ అండ్ కో.,
నేతాజీ సుభాష్ రోడ్, మద్రాసు.




ఫెస్టివల్
సూపర్ శాండల్ టాల్కం పౌడర్ & స్నో

తయారుచేయువారు: మురళీ ట్రేడర్సు, మదరాసు - 21.
ఆంధ్రజిల్లాలకు ఏజెంట్లు: శివకోటి లక్ష్మీనరసింహము, విజయవాడ.

## చందాదారులకు మనవి

పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందని వారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీ లోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడి వచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.



## 'చందమామ' కు

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలుకూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 3-0-0 పంపుతూవుంటే మీకు 8 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిని మీకు ప్రతినెలా 1-0-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు వ్రాయండి.

**చందమామ పబ్లికేషన్సు,**

వడపళని, మద్రాసు - 26

లిలీస్

మాల్టో

బిస్కతులు

బిడ్డలకు ప్రియమైనవి.

LILY BISCUIT CO. PRIVATE LTD., CALCUTTA-4




...శ్రీ సారథి స్టూడియోస్ చిత్రం...

# ఎత్తుకు పైయెత్తు

డైరెక్టర్... తాపీ చాణక్య, ప్రొడ్యూసర్. సి.వి.ఆర్.ప్రసాద్.

CH.E.PRASADRAO



# అడవిలో పల్లెటూరు

మనం నివసించే యీ మహాప్రపంచములో రకరకాల ప్రజలు వున్నారు. ఉదాహరణకు: ఆఫ్రికా ఖండంలోని దట్టమైన అడవులలో మరుగుజ్జు (పిగ్మీ) జాతి వారు నివసిస్తున్నారు. వీరికి ఒక ఊరూ, ఇల్లూ అంటూ లేదు. అడవులలో తిరుగుతూ వారి ఆహారానికి అడవి మృగాలను వేటాడి, అడవుల్లోని పండ్లూ, ఫలాలను ఏరుకుంటూ కాలక్షేపం చేస్తుంటారు. ఇదే వీరి బ్రతుకుతెరువు.

మన భారతదేశంలోకూడా దట్టమైన అడవులున్నాయి. కాని యిక్కడ నివసించేవారు పిగ్మీజాతిని పోలినవారు కారు. అనగా మధ్యప్రదేశ్ అడవుల్లో వుండేవారు చిన్నచిన్న గ్రామాల్లో నివసిస్తుంటారు. వారువుండేది పూరిగుడిసెల్లో. కట్టు, కలపా కొట్టుకుంటూ, అక్కడక్కడవున్న మంచి భూమినిదున్ని పంటలుపండించుకుంటూ, గొర్లను, మేకలను, కోళ్లను పెంచుకుంటూ పొట్టపోసుకుంటారు. వీరు చీకూ,చింతాలేని కష్టజీవులు.

ఈ అమాయక ప్రజలు ఆనంద, వినోదాలన్నీ వెదికోసుకుంటారు. ఆట పాటల్లో, నృత్యం, కథలు కబుర్లు చెప్పుకోవడం, వారి వినోద కార్యక్రమాలు. వారి నిత్యభోగాలలో టీ ముఖ్యం. పనిపాటులకు పోయేముందు, తిరిగి వచ్చాక వారికి ఉత్సాహోన్నిచ్చే, ఉల్లాసమొసగే టీ అంటే వారికి మహాయిష్టం. అందులోనూ వారికి బ్రూక్ బాండ్ టీ అంటే యింతా అంతా యిష్టం కాదు.

ఈ అడవి ప్రదేశాలకు దగ్గరలో వున్న డిపోల నుండి బ్రూక్ బాండ్ సేల్స్మను తాజా బ్రూక్ బాండ్ టీని తీసుకొని అడవుల్లోని గ్రామాలకు వెళ్లను. సేల్స్మను గ్రామానికి వచ్చాడనగానే అక్కడి అమాయక ప్రజలు, వారికి ఉత్సాహము, ఉల్లాసము యిచ్చే తాజా బ్రూక్ బాండ్ టీని తెచ్చాడుగదా అని కృతజ్ఞతతో సంతృప్తి చెందుతారు.

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్

BB 230

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మనపైన సంఘంయొక్క ప్రభావం ప్రబలంగా ఉంటుంది. సంఘం మంచిదైతే మనం సంఘంకోసం మనలో ఉన్న చెడ్డగుణాలను అదుపులో ఉంచుకుంటాం. సంఘం చెడ్డదైతే, మనం స్వతః మంచివాళ్లమై ఉన్నప్పటికీ, సంఘం కోసరం కొంత చెడ్డతనాన్ని తెచ్చిపెట్టుకుంటాం. ఈవిషయాన్ని "రాజరిక ప్రభావం" [బేతాళ కథ] వివరిస్తున్నది.

అందుకని మనుషులు బాగుపడటం కన్నకూడా సంఘం బాగుపడటం ఎక్కువ అవసరమని తెలుసుకోవాలి.

సంపుటి 22 ఫిబ్రవరి 1958 సంచిక 2



# అట్టవిహారి బొమ్మ

తరవాత అర్జునుడు రథాన్ని శమీవృక్షం వద్ద ఆపి ఉత్తరుడితో, "నాయనా, ఈ చెట్టుపైన పంచపాండవుల ఆయుధాలున్నాయి. నీవు చెట్టెక్కి వాటిని దించి నట్టయితే వాటి సహాయంతో ఈ కౌరవ సేనలను ఓడిస్తాను," అన్నాడు.

"ఈ చెట్టుపైన ఏదో శవం ఉన్నదట. నన్నా శవాన్ని ముట్టుకోమనటం ధర్మమేనా?" అన్నాడు ఉత్తరుడు. "మత్స్యరాజు కొడుకువు—నీకు కూడని పని చెబుతానా? అక్కడ శవంలేదు. ఎక్కు," అన్నాడు అర్జునుడు.

ఉత్తరుడు చెట్టెక్కి, పాండవుల అస్త్రాలపైన ఉన్న కప్పు తొలగించి ఆ అస్త్రాలను చూచి ఆశ్చర్యపోయాడు. అర్జునుడు ఆ అస్త్రాలు ఎవరెవరివో వివరించి చెప్పి చిట్టచివరకు, "నేనే అర్జునుణ్ణి. వలలుడు భీముడు. కంకుభట్టు ధర్మరాజు. మాలిని ద్రౌపది. అశ్వాలనూ గోవులనూ చూస్తున్నవారు నకుల సహదేవులు!" అని చెప్పాడు. ఉత్తరుడు నమ్మలేకపోయాడు. అర్జునుడు తనకుగల పదిపేర్లూ చెప్పి, అవి ఎలావచ్చాయో వివరించినప్పుడు ఉత్తరుడికి నమ్మకం కుదిరింది. "రథసారథ్యంలో నేను నిజంగా ఆరితేరినవాణ్ణి. ఆ కనిపించే కౌరవ సేనలో ఏ వేపు రథం తోలమన్నావో చెప్పు!" అన్నాడతను.

"బాణం వేసే దూరంలో రథాన్ని ఆపు. తరవాత ఎటు తోలాలో చెబుతాను!" అన్నాడు అర్జునుడు. శరవేగంతో వచ్చే రథాన్ని కౌరవనాయకులు చూసి, వచ్చేది అర్జునుడని గుర్తించారు. వారిలో తర్జనభర్జనలు జరిగాయి. "ఈ పాండవులు పన్నెండేళ్ల వనవాసానంతరం ఒక ఏడు పూర్తిగా అజ్ఞాతవాసం చెయ్యకుండానే బయటపడ్డారు. జూద నియమం ప్రకారం తిరిగి పన్నెండేళ్ళు వనవాసమూ, ఒక ఏడు అజ్ఞాతవాసమూ చేయాలి," అన్నాడు దుర్యోధనుడు.

"నీ లెక్క సరికాదు. అజ్ఞాతవాసం పూర్తి కాకపోతే పాండవులు బయటపడరు. ముందు యుద్ధం సంగతి ఆలోచించు," అంటూ భీష్ముడు కౌరవసేనలో యోధులను ఒక్కొక్కచోట ఒక్కొక్కరిని నియోగించి, వ్యూహం తయారుచేశాడు.

రథం కౌరవసేనకు అంతదూరాన నిలబడింది. అర్జునుడు యోధులను కలయజూసి, "అదుగో, దుర్యోధనుడి రథం. మన రథాన్ని సూటిగా అటుకేసి తోలు!" అన్నాడు ఉత్తరుడితో. రథం దుర్యోధనుడున్న దిక్కుగా బయలుదేరింది. అర్జునుడు కౌరవసేనలపై బాణాలు కురిపించసాగాడు.



# వైరాగ్యం

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో విదేహదేశానికి ముఖ్యపట్టణమైన మిథిలానగరంలో మహాజనకుడనే రాజు ఉండేవాడు. ఆయనకు అరిష్ట జనకుడనీ, పోలజనకుడనీ ఇద్దరు కుమారులుండేవారు.

మహాజనకుడు పోయాక అరిష్టజనకుడు రాజ్యాభిషేకం చేసుకుని రాజై, తన తమ్ముడైన పోలజనకుణ్ణి యువరాజు చేశాడు. అయితే కొంతకాలానికి అరిష్టజనకుడికి తన తమ్ముడు తనను చంపి రాజు కావాలని చూస్తున్నట్టు నౌకర్లద్వారా రహస్య వార్తలు అందాయి. కాని అరిష్టజనకుడు వాటిని లక్ష్యపెట్టలేదు.

తన అన్న అలక్ష్యం ఆధారం చేసుకుని పోలజనకుడు కొంత పరివారాన్ని కూడగట్టుకుని, అన్నపై కుట్రపన్ని, ఒకనాడు ఆయనపై తన సిబ్బందితో వెళ్ళిపడి ఆయనను హత్యచేసేశాడు.

అరిష్టజనకుడు చనిపోయే సమయానికి ఆయన పట్టపురాణి గర్భవతిగా ఉన్నది. తన భర్త చనిపోయిన వార్త వినగానే ఆమె తన నగలూ నాణ్యాలూ ఒక గంపలో పెట్టి, వాటిపైన ఊక కప్పింది. తరవాత ఆమె మాసిన బట్టలు కట్టుకుని, గంప నెత్తిన పెట్టుకుని బయలుదేరింది. దారిలో ఆమెనెవరూ గుర్తించలేదు. ఆమె ఉత్తరద్వారం కుండా నగరం దాటి వచ్చేసింది.

ఎటువెళ్ళాలో ఆమెకు తెలియదు; ఆమె ఎన్నడూ రాజసౌధం దాటి ఇవతలికి వచ్చిన మనిషి కాదు. కాలచంప అనే నగరం ఒకటి ఎక్కడో ఉన్నట్టు ఆమె విని ఉన్నది. అందుచేత ఆమె ఒక చెట్టుకింద తన గంప పెట్టుకు కూచుని, దారివెంట వచ్చేపోయే వారిని, "కాలచంప నగరానికి దారి ఎటు, నాయనా?" అని అడగసాగింది. ఆమెకు ఎవరూ దారి చెప్పలేకపోయారు.



చిట్టచివరకు ఒక ముసలివాడు బండి తోలుకుంటూ అటుగా వచ్చాడు. వాడు రాణీతో, "నేను ఆ నగరానికే పోతున్నాను, బండి ఎక్కి కూచో అమ్మా, నిండు చూలాలులాగా ఉన్నావు. బండి జాగ్రత్తగా, కుదుపు లేకుండా తోలుతాలే," అన్నాడు. రాణీ ఆ బండిలో ఎక్కి కాలచంప నగరానికి చేరుకున్నది. బండివాడు ఆమెను గ్రామచావడివద్ద దించి వెళ్ళిపోయాడు. ఇక ఎక్కడికి వెళ్లాలో ఆమెకు తెలియదు. అందుచేత ఆమె ఆ గ్రామచావడిలో వెళ్ళి కూచుని, దాని ముందుగా నడిచే మనుషులను చూడసాగింది.



కొంతసేపటికి ఒక బ్రాహ్మణుడు తన శిష్యులతోసహా స్నానానికి వెళుతూ చావడిలో కూర్చుని ఉన్న గర్భిణీస్త్రీని చూశాడు. ఆయన తన శిష్యులను బయటనే ఉండమని, లోపలికి వచ్చి రాణిని పలకరించాడు.

"నాయనా, నేను మిథిలానగరపు రాణిని. నా భర్త యుద్ధంలో చనిపోవటంవల్ల నేను దిక్కులేని అనాథనై పోయాను. నా కిప్పుడెవరూ లేరు. ఈ నగరంలో నేనెవరినీ ఎరుగను," అన్నది రాణి బ్రాహ్మడితో.

"అలా అయితే నువు మా ఇంట తల దాచుకోవచ్చు. కాని ముందుగా ఒక చిన్న నాటకం ఆడాలి. నా కాళ్ళమీద పడి, బయట ఉన్న నా శిష్యులు వినేటట్టు భోరుమని శోకాలుపెట్టు. నీ రహస్యం ఎవరికీ తెలియకుండా నిన్ను కాపాడుతాను," అన్నాడు బ్రాహ్మడు. రాణీ ఆయన చెప్పినట్టే చేసింది. ఎవరో స్త్రీ తమ గురువుగారి కాళ్ళమీద పడి బావురుమనటం చూడగానే శిష్యులు ఆత్రంగా లోపలికి వచ్చి, "ఏమిటి? ఏమిటీ?" అని ప్రశ్నించారు. దారే పొయ్యే వారుకూడా చాలామంది చేరారు. బ్రాహ్మడు వారందరికీ ఈ విధంగా చెప్పాడు.

"ఇది నా కడకొట్టు చెల్లెలు. నేను స్వగ్రామం విడిచిపెట్టాక పుట్టింది. అందు

చేత దీన్ని నేనింతకు పూర్వం ఎన్నడూ చూసి ఎరుగను."

ఈ మాటలు అందరూ విశ్వసించారు. బ్రాహ్మడు ఆమెను తన ఇంటికి తీసుకుపోయి, చక్కగా స్నానం చేయించి, భోజనం పెట్టించాడు. కొద్దిరోజులకల్లా ఆమె ఒక మగ పిల్లవాణ్ణి కన్నది. ఆ పిల్లవాడి కామె మహాజనకుడని తన మామగారి పేరు పెట్టుకున్నది. ఈ మహాజనకుడే బోధిసత్త్వుడు.

మహాజనకుడు క్రమంగా పెరిగి పెద్దవాడు కాసాగాడు. అతనితో ఆడుకునే క్షత్రియ కుమారులు అతన్ని చులకనగా చూసేవాళ్ళు. ఇది చూసి మహాజనకుడు మండిపడి వాళ్లను చితకతన్నేవాడు. వాళ్లు ఏడుస్తూ వెళ్లి తమ పెద్దవాళ్ళతో, "ఆ విధవరాలి కొడుకు మమ్మల్ని తన్నాడు!" అని చెప్పేవాళ్ళు.

"విధవరాలి కొడుకు" అన్నమాట వినగానే మహాజనకుడికి తన తండ్రి ఎవరా అని సందేహం కలిగింది. మొదట్లో తల్లి అతనికి నిజం చెప్పలేదు. కాని మహాజనకుడు పట్టుబట్టటంచేత ఆమె జరిగినదంతా కొడుకుకు చెప్పేసింది.

తన పినతండ్రి తన తండ్రితో యుద్ధం చేసి, యుద్ధంలో తన తండ్రిని చంపి విదేహ రాజ్యం వశపరచుకున్నాడని తెలియగానే,



ఆ రాజ్యం తిరిగి సాధించాలన్న కోరిక మహాజనకుడికి మనసులో తల ఎత్తింది. పదహారేళ్ళు నిండగానే అతను తన చదువు సంధ్యలు ముగించి, తల్లితో, "అమ్మా, నేను విదేహరాజ్యాన్ని జయిస్తాను. నీదగ్గిర సొమ్మేమైనా ఉన్నదా?" అని అడిగాడు. ఆమె అతనికి తాను గంపలో దాచి మిథిలా నగరంనుంచి తెచ్చిన బంగారమూ, నగలూ చూపింది. అందులో సగం మాత్రమే తీసుకుని మహాజనకుడు మిథిలానగరానికి ప్రయాణమయాడు.

సరిగా ఆ రోజే మిథిలానగరంలో పోల జనకమహారాజుకు ఒక చెయ్యీ, కాలూ పడిపోయింది; ఆయన మంచం పట్టాడు. సరిగా మహాజనకుడు మిథిలానగరంలో అడుగు పెట్టిననాడే రాజభవనంలో పోల జనకుడు మరణించాడు.

ఆయనకు వారసులెవరూ లేరు. రాజ పురోహితుడు ఒక రథంమీద రాజకిరీటమూ, రాజఛత్రమూ, రాజదండమూ, పాదుకలూ మొదలైనవి పెట్టి రథాన్ని యథేచ్ఛగా పోనిచ్చాడు. పురోహితుడూ మంత్రులూ రథం వెనక నడుస్తూ బయలుదేరారు.

రథం కొంతదూరం వెళ్ళి ఉద్యాన వనంలో మహాజనకుడు విశ్రాంతి తీసుకుంటున్నచోట ఆగిపోయింది.





రాజపురోహితుడు మహాజనకుణ్ణి పరీక్షించి అతని శరీరంపైన రాజలక్షణాలుండటం గమనించి, విదేహదేశానికి అతనిని రాజుగా ప్రకటించాడు. అతనికి పట్టాభిషేకం జరిగింది. తరవాత మహాజనకుడు సీవలీదేవిని పెళ్ళాడి, సుఖంగా రాజ్యం చేయసాగాడు. వారికి దీర్ఘాయువు అని ఒక కుమారుడుకూడా కలిగాడు.

కొంతకాలం గడిచింది. ఒకరోజు మహాజనకుడికి తోటలు చూడాలని వేడుక కలిగింది. ఆయన తన ఏనుగునెక్కి తోటలు చూడటానికి బయలుదేరాడు. తోటలోకి ప్రవేశిస్తూనే ఆయన రెండు అందమైన గున్నమామిడిచెట్లను చూశాడు. అవి గుబురుగా, నవనవలాడుతూ ఉన్నాయి. వాటిలో ఒక చెట్టునిండా పళ్లున్నాయి. రెండవచెట్టుమీద ఒక్కపండుకూడా లేదు. పళ్ళున్న చెట్టునుంచి ఒకపండు కోయించుకొని తిని, అది చాలా రుచిగా ఉండటంచేత రాజుగారు, తిరిగి వచ్చేటప్పుడు మరికొన్ని పళ్ళు తిందామని తన మనసులో అనుకున్నాడు.

ఆయన ముందుకు సాగి వెళ్లగానే రాజుగారి పరివారంలోవారంతా ఆత్రంగా మామిడిపళ్లు కోసుకుని తిన్నారు. కొందరు తొందరలో కొమ్మలుకూడా విరిచారు. ఎంతో అందంగా ఉండిన గున్నమామిడి కొద్ది క్షణాలలో భీభత్సంగా అయిపోయింది.

రాజుగారు తోటలన్నీ కలియతిరిగి, తిరిగి వస్తూ పాడుపడిపోయిన మామిడిపళ్ళచెట్టును చూసి నిర్ఘాంతపోయాడు. దాని పక్కనే ఉన్న గొడ్డుమామిడిచెట్టు ఎప్పటిలాగే నవనవలాడుతూ ఉంది.

"ఇది నాకొక గుణపాఠం. రాజ్యవైభవమంతా ఈ పళ్ళచెట్టులాటిది, సన్యాసం గొడ్డుచెట్టులాటిది. దీనిజోలికి ఎవరూ రారు. ఈ వైభవమంతా విడిచిపెట్టి నేను సన్యాసం పుచ్చుకుంటాను!" అనుకున్నాడు మహాజనకుడు. [ముగింపు వచ్చే సంచికలో]






## 14

[క్రూరుడైన ఓడసరంగువల్ల అనేక యిక్కట్లు పొందిన బానిసలు, పింగళుడి నాయకత్వం కింద తిరుగుబాటు చేసి, అతణ్ణి హతమార్చారు. అదే సమయంలో శత్రుఓడ, వారున్న ఓడను సమీపించింది. పింగళుడు తన ఓడతో, శత్రుఓడను ఢీకొట్టాడు. ఆ తాకిడికి పింగళుడు ఓడమీదినుంచి ఎగిరి దూరంగా సముద్రంలో పడిపోయాడు. తరవాత—]

పింగళుడు ఒక బుడక వేసి నీటిమీదికి తేలి చుట్టూ కలయచూశాడు. రెండు ఓడలూ ఒకదానినొకటి ఢీకొనడంతో, ఆ తాకిడికి బదాబదలై, కొయ్యముక్కలూ, చెక్కలూ, తెరచాపలూ చెల్లాచెదురుగా—నలుమూలలకూ ఎండుటాకుల్లా ఎగిరిపోతున్నాయి. మునిగిపోతున్న నావికులు చేసే హాహాకారాలు, తుఫాను ఘోషలో అణగారిపోయినై.

ఉవ్వెత్తున లేచి పడుతున్న సముద్రపు టలలో చిక్కి పింగళుడు వుక్కిరిబిక్కిరై పోయాడు. తను సురక్షితంగా భూప్రదేశం చేరేందుకు యిప్పుడు ఓడ అంటూ ఏమీ లేదు. రెక్కల బలాన్ని నమ్ముకుని యీదేందుకు, తీరం ఎటువైపున వున్నదో తెలియదు. యీ దుర్దశ తన ఒక్కడికే కాక, తన శత్రువులకూ, మిత్రులకుకూడా కలిగిందని గ్రహించినప్పుడు పింగళుడికి ఆనందంతో పాటు బాధకూడా కలిగింది.

తన ప్రాణాన్ని కాపాడుకునేందుకు, తను ఎటు యీదుకుపోవాలో పింగళుడికి అర్థంకాలేదు. కనుచూపు మేరలో ఎక్కడా భూమిఅంటూ కనిపించనప్పుడు, తను వున్న





న్నది. పింగళుడి చేతులకు దొరికిన వస్తువు, ఓడ పగలగా విడిపోయిన ఒకానొక కొయ్యపలక. పింగళుడు మనసులోనే దేవుడికి వెయ్యినమస్కారాలు పెట్టుకుని, ఆ కొయ్యపలకను బలంగా రెండుచేతుల మధ్యకూ తీసుకుని, దానిమీద బోర్లా పడుకున్నాడు. తుఫానూ సముద్రపుటలలూ కలిసి, తనను ఏదో ఒకనాడు, ఏదో ఒక తీరానికి తప్పక చేర్చగలవని అతడికి ఆశ కలిగింది. ఆ సమయంలో ఆకలీ, చలీ—వాటినిగురించి అతడు ఆలోచించ దలచలేదు.

కొయ్యపలక నీటి అలలవెంట తేలుతూ, మునుగుతూ కొట్టుకుపోతున్నది. పింగళుడు రెండుకళ్లూ గట్టిగా మూసుకుని, కొయ్యపలక తన పట్టునుంచి జారిపోకుండా చూసుకుంటూ తనచుట్టూ ఏమి జరుగుతున్నదీ గమనించేందుకైనా ప్రయత్నించలేదు. కారణం, అందువల్ల తనకు జరిగే మేలు లేకపోగా, పైపెచ్చు తనలో వున్న ధైర్యం కాస్తా నీళ్లుకారిపోయేందుకు అవకాశం యిస్తుందని అతడు భయపడ్డాడు.

కొన్ని గంటలకాలం గడిచిపోయింది. సూర్యుడు ఎక్కడో సముద్రాల అవతల అస్తమించాడు. చీకటి పడింది. కాని, పింగళుడికి యివేమీ తెలియవు. అతడి కళ్లు

చోటునుంచి కదిలేందుకు ప్రయాసపడటం వృథా అని అతడు నిశ్చయించుకున్నాడు. కాని, అల్లకల్లోలంగా వున్న సముద్రం అతణ్ణి ప్రతిక్షణం అటూయిటూ విసరివేస్తున్నది.

దాదాపు ఓ పావుగంటకాలం పింగళుడు అలలవెంట, అవి విసిరినవైపుకు పోతూ, మునుగుతూ తేలుతూ నానాయాతనా పడ్డాడు. ఇక తన చావు ఎంతో దూరంలో లేదని అతడు నిశ్చయించుకున్న మరుక్షణం అతడి చేతికి ఏదో వస్తువు తగిలింది. పింగళుడు చటుక్కున దాన్ని పట్టుకున్నాడు.

ఇంతకూ పింగళుడి తల్లి అన్నట్టు, అతణ్ణి ఎప్పుడూ అదృష్టదేవత వెన్నంటే వుంటు





గట్టిగా మూతలు పడేవున్నవి. సముద్రపు హోరూ, తన శరీరం చలికి కొయ్యబారుతూ వుండటం తప్ప, అతడికి మరేమీ గుర్తులేదు. మరి కొంతసేపటికి దప్పికతో నాలుక పిడచ కట్టుకుపోతునట్టు అతడు గ్రహించాడు. అప్రయత్నంగా పింగళుడు యింత సముద్రపు నీటిని గుటకవేసి, వికారంతో కొయ్య పలకమీద మెలికలు తిరిగాడు. ఆ తరవాత భగ్గుమనే ఆకలి, నిద్రమత్తు. క్రమంగా పింగళుడు తను పట్టుకున్న కొయ్యపలకా, హోరుపెడుతున్న సముద్రం, తను ప్రాణాపాయస్థితిలో వున్న సంగతీ—అన్నీ మరిచిపోయి గాఢనిద్రలోకి జారుకున్నాడు.

పింగళుడు తిరిగి కళ్లు తెరిచేసరికి, మబ్బులు లేని ప్రశాంతమైన నీలాకాశం అతడి కళ్ళబడింది. శరీరం నడుమునుంచి పైభాగం పొయ్యిలో పెట్టి కాల్చుతున్నట్టు చిటపటమంటున్నది. కాళ్లు చలితో కొయ్యబారిపోతున్నవి.

ఈ పరిస్థితి పింగళుడికి చాలా వింతగా తోచింది. తను ఎక్కడ వున్నట్టు? అతడు నీరసంగా తల పక్కకు తిప్పి చూశాడు. కనుచూపుమేర అంతా ఇసుక ఎడారి. పింగళుడు గతుక్కుమన్నాడు. ఆ నిమిషంలో అతడికి ప్రాణభయంతో పాటు,



ఎక్కడలేని సత్తువా వచ్చినట్టయింది. చప్పున మోచేతులు భూమికి ఆనించి లేచేందుకు ప్రయత్నించాడు. కాళ్ళు రెండూ నీళ్ళలో నానుతున్నవి. ఎదురుగా మహాసముద్రం ఏ అలలూ లేకుండా ప్రశాంతమైన సరస్సులా నిర్మలంగా కనిపించింది.

తన పరిసరాలు ఎటువంటివో, తను ఎలాంటి భూప్రదేశాన్ని చేరాడో పింగళుడు వెంటనే గ్రహించాడు. ఒకవైపున మహాసముద్రం, రెండవవైపున మచ్చుకైనా చెట్టూ చేమా లేని పెద్ద ఇసుకఎడారి!

పింగళుడు తూలుతూ రెండడుగులు ముందుకువేసి, సూర్యకాంతి కళ్ళమీద పడ




కుండా చేతిని అడ్డంగా పెట్టుకుని, దూరంగా గమనించి చూశాడు. అల్లంత దూరాన ఆకాశంలో ఎగురుతున్న కొన్ని రాబందులు అతడి కంటబడినై. అవి ఎక్కడికో ఎగిరి పోవటంకాక, ఒకేప్రదేశాన చుట్టూ వలయాకారంగా ఎగురుతూ, కిందికి దిగివస్తున్నవి.

పింగళుడిలో ఆశ్చర్యంతోపాటు, ఆశ కూడా మొలకలెత్తింది. రాబందులు ఎగురుతున్న ప్రదేశంలో ఏదో జలాశయంగాని, పల్లెపట్టుగాని తప్పక వుండివుంటుందని అతడు భావించాడు. ఈ తలపు కలగగానే, అతడిలో ఎక్కడలేని శక్తి పెల్లుబికింది. దృష్టిని ఆ రాబందులు ఎగురుతున్న ప్రదేశం



మీదే లగ్నంచేసి, అతడు భగ్గుమని కాలుతున్న ఇసుకలో ఓపికకొందికీ నడవసాగాడు.

కొద్దిసేపటికల్లా పింగళుడు ఆ ప్రదేశాన్ని సమీపించాడు. అసరికి కొన్ని రాబందులు కిందికి దిగి, అక్కడ పడివున్న ఏదో వస్తువును చుట్టుముట్టుతున్నవి. ఆ దృశ్యం చూస్తూనే పింగళుడు నివ్వెరపోయాడు.

ఒకవ్యక్తి కాళ్లూ చేతులూ, తాడుతో వెనక్కు విరిచికట్టబడి, ఒక రాతికి ఆనించబడివున్నాడు. అతడిలో ఏమాత్రం చలనం వున్నట్టులేదు. రాబందులు, అతణ్ణి పీక్కు తినేందుకు చుట్టూ మూగుతున్నవి. పింగళుడు, ఓ తృటికాలం ఆ నిర్భాగ్యుడికేసి చూసి, చప్పున వంగి అక్కడ దొరికిన చిన్న రాతిముక్కను తీసుకుని, రాబందులకేసి విసిరాడు. వెంటనే కొన్ని రాబందులు రెక్కలు టపటపలాడించి ఆకాశంలోకి లేచినై. మరికొన్ని అంతదూరం పరిగెత్తి, అక్కడ నిలబడి ఆశగా తమకు కానున్న ఆహారంకేసి చూస్తున్నవి.

పింగళుడు ఆ వ్యక్తిని సమీపించాడు. అతడి కళ్లు మూతలుపడి వున్నవి. ఏమాత్రమైనా ప్రాణం వున్న సూచన కనబడుతుందేమో అని, పింగళుడు అతడి గుండెలమీద చేయివేసి పరీక్షించాడు. చలనం లేదు.





ఈ ఇసుక ఎడారిలో ఎవరు, ఏ కారణం వల్ల ఈ మనిషిని ఇటువంటి ఘోరమరణం పాలుచేశారో పింగళుడి వూహకు అందలేదు. కాని, అతడికి ఆ నిమిషంలో ఒక కొత్త విషయం అర్థమైంది. భయంకరంగా, నిర్జనంగా కనిపించే, యీ ఎడారిలో ఎక్కడో ఒకచోట జననివాసాలు వున్నవి. వాళ్లు ఎటువంటివారో వూహించటంకూడా ఏమంత కష్టంకాదు. ఒక మనిషిని నిస్సహాయుణ్ణిగా చేసి, రాబందులకు ఆహారంగా వదిలిపోవటాన్నిబట్టి, వాళ్లు చాలా క్రూరులై వుంటారని పింగళుడు భావించాడు.

ఇప్పుడు తన కర్తవ్యం ఏమిటి? ముందు దాహం తీర్చుకునేందుకు తనకు యింత మంచినీరు కావాలి. తరవాత ఆహారం. ఇవి తనకు ఎక్కడ లభిస్తవి?

పింగళుడు యిలాంటి సమస్యలతో సతమతమవుతూండగా, దూరంగా, ఎడారిలో తిరుగుతున్న ఒకానొక ఒంటెల పటాలం నాయకుడు, తన దుర్భిణీలోంచి అతణ్ణీ, పక్కన వున్న చనిపోయిన వ్యక్తినీ, చుట్టూ ఎగురుతున్న రాబందుల సమూహాన్నీ చూశాడు. మరుక్షణం అతడి ఆజ్ఞ కాగానే ఒంటెల పటాలం అమిత వేగంగా, ఆ ప్రదేశం వైపుకు పరిగెత్తిరాసాగింది.



దూరంగా ఎడారిలో దుమ్ము లేస్తూండటాన్ని గమనించి మొదట ఆశ్చర్యపడిన పింగళుడికి, అంతలోనే దానికి కారణం అయిన ఒంటెల పటాలం స్పష్టంగా కనబడగానే వుత్సాహంతోపాటు భయంకూడా కలిగింది. ఒకవేళ ఆ వచ్చేవాళ్లు ఎడారి దొంగలైతే, ఆ నిమిషంతో తన బ్రతుకు అవసాన దశకు వచ్చినట్లే అని అతడు భయపడ్డాడు. కాని, పారిపోయి ఎక్కడైనా దాక్కునేందుకు స్థలంగాని, అందుకు అవసరమైన దేహబలంగాని తనదగ్గిర లేదు. అసలు తను యిప్పుడున్న దీనస్థితిలో కాలుతీసి కాలు పెట్టటమే అంతంతమాత్రంగా వుంది.





వాడు మనవాడే! మిగతా కోట కాపలా దళం ఏమయినట్టు? బహుశా, కోట రాబందు పశం కాలేదుగదా?'' అంటూ విస్తుపోయాడు.

ఈలోపల పటాలంలోని ఒకడు పింగళుడి వీపుమీద తన యీటెను ఆనించి, ''నిజం చెప్పు, మీ నాయకుడు రాబందు ఎక్కడ?'' అంటూ గద్దించి అడిగాడు.

పింగళుడికి ఆ ప్రశ్న ఏమీ అర్థంకాలేదు. బహుశా ఆ రాబందు అనబడేవాడు ఏదో దొంగల ముఠాకు నాయకుడై వుంటాడు. అలా అయితే, వీళ్లు ఎవరు?

''నేను ఎవరి అనుచరుణ్ణీ కాదు. మహా సముద్రంమీద తుఫానులో చిక్కి నేనున్న ఓడ భగ్నంకాగా, దేవుడి కృపవలన ప్రాణాలతో యీ తీరం చేరాను. ఇక్కడ, ఈ మృతుణ్ణి రాబందులు పీక్కుతినబోవటం చూసి యిక్కడికి వచ్చాను. ఇది ఏ దేశమో, యీ ఎడారి పేరేమిటోకూడా నాకు తెలియదు,'' అన్నాడు పింగళుడు. ఒంటెల పటాలం నాయకుడు, పింగళుడికేసి మరో సారి పరిశీలనగా చూసి, ''నువ్వు చెప్పేది నిజమయితే, నీకు వచ్చిన భయమేమీలేదు. కాని, ఒకవేళ అబద్ధం అయితేమాత్రం నిన్ను ముక్కలుముక్కలుగా నరికించి, ఆ ఎగురుతున్న రాబందులకు ఆహారంగా

పింగళుడు యిలాంటి వూహలతో, అనుమానాలతో వుక్కిరిబిక్కిరవుతూండగా ఒంటెల పటాలం అక్కడికి రానేవచ్చింది. గంభీరమైన పెద్ద గొంతుతో నాయకుడు అజ్ఞాపించగానే, పటాలంలోని ప్రతిఒక్కరూ తమతమ వాహనాలను దిగి, పింగళుణ్ణి చుట్టుముట్టారు. నివ్వెరపోయి, నోట మాట రాక తడబడుతున్న పింగళుణ్ణి, వాళ్ళ నాయకుడు కొంచెంసేపు నిలువెల్లా పరీక్షగా చూసి, ''నువ్వు రాబందు అనుచరవర్గం లోనివాడివా?'' అని ప్రశ్నిస్తూ, చనిపోయిన వ్యక్తిదగ్గిర వంగి, పరీక్షగా చూసి, చప్పున తన అనుచరులకేసి తిరిగి, ''ఈ చనిపోయిన





వేయిస్తాను. నువ్వు యిప్పుడున్నది ఆఫ్రికా సముద్రతీరాన గల అరేబియాదేశప్రాంతం. నేను నవాబుగారి ఒంటెలపటాలం నాయకుణ్ణి. ఇక, నీ ఓడ సముద్రంమీద భగ్నం అవడం అదీ....అంతా నిజం చెప్పాలి, తెలిసిందా ?" అన్నాడు.

ఆ వచ్చినవాళ్లు దొంగలు కాదని, నవాబు సైనికులని తెలియగానే పింగళుడికి ఎక్కడ లేని ఆనందమూ కలిగింది. ఆ ఎడారి ప్రాంతాన్ని పాలించే నవాబూ, అతడి ఒంటెలపటాలం నాయకుణ్ణని చెప్పే యితడూ, ఎలాంటి వారైనా ప్రస్తుతానికి మాత్రం తనకు ప్రాణభయం లేదు. తరవాత పరిస్థితులనుబట్టి, అందుకు అనుగుణంగా ప్రవర్తించవచ్చు. కనక, పూర్వగాథ అంతా వదిలి, తను బానిసగా ఓడలో చేరినప్పటి నుంచీ, జరిగిన వృత్తాంతం, అతడికి చెప్ప వచ్చునుకున్నాడు పింగళుడు.

ఆ ప్రకారమే, పింగళుడు పటాలం నాయకుడికి తను చేరిన ఓడసరంగును గురించీ, మహాసముద్రంమీద తారసపడిన మరొక ఓడకూ దానికీ జరిగిన యుద్ధం గురించీ సవిస్తరంగా చెప్పాడు. అంతా విన్న పటాలంనాయకుడు తృప్తిగా ఓమారు నవ్వి, "అయితే, మీ ఓడను ఎదిరించిన



ఓడలోకూడా బానిసలున్నారనేదాంట్లో అనుమానం ఏమీ లేదుకదా ?" అని అడిగాడు.

"అవును, అందులో సందేహం లేదు. ఆ ఓడసరంగుతో నేను రాజీరాయబారం నడపాలని ప్రయత్నించినప్పుడు, అతడిచ్చిన జవాబునుబట్టి, అతడూ బానిసలను కొనీ అమ్మే వ్యాపారేనని తెలుస్తున్నదిగదా ?" అన్నాడు పింగళుడు.

పటాలం నాయకుడు అవునన్నట్టు తల వూపి, "నాపేరు హసన్‌గోరీ. నాలాగే నువ్వూ, యుద్ధంలో చాలామందికి నాయకత్వం వహించావు గనక, నువ్వూ నాతో సమానుడివే. కనక, నన్ను ఆ పేరుతో నువ్వు



పిలవవచ్చు. మేము, 'రాబందు' అని పిలవబడే ఒకానొక ఎడారిదొంగను హత మార్చేందుకు, యీ ఎడారిలో గస్తీ తిరుగు తున్నాం. యీ కాళ్ళూ చేతులూ బంధింప బడి, మరణించిన వ్యక్తి సవాబుసైన్యంలోని వాడే! ఇతడు ఎడారిలో వున్న ఇఫీఖిల్లాను రక్షిస్తున్నవాళ్లల్లో ఒకడు. ఇతణ్ణి ఏ విధంగా ఆ రాబందు పట్టుకోగలిగాడో నాకు అర్థం కావడం లేదు. నా భయం ఏమిటంటే, దురదృష్టవశాత్తూ ఆ ఖిల్లా రాబందు వశం అయిపోయిందేమోనని," అంటూ అతడు సైనికులకేసి తిరిగి, "ఈ క్షణంనుంచీ యితణ్ణి కూడా పటాలంలో ఒకడుగా భావించండి. పాపం, ఆకలికి అలమటిస్తున్నట్టున్నాడు, ఆహారం, నీరూ యివ్వండి," అన్నాడు.

హసన్‌గోరీ అలా అనేసరికి, పింగళుడికి ప్రాణం లేచివచ్చినట్టయింది. సైనికులిచ్చిన రొట్టెలు తిని, చల్లని నీరు యింత తాగి, అతడు తృప్తిగా లేచి నిలుచున్నాడు. వెంటనే హసన్‌గోరీ పింగళుడికి ఒక ఒంటెను చూపిస్తూ, "ఈ ఒంటె యిక నుంచీ నీ వాహనం. మనం యిప్పుడే బయలు దేరుతున్నాం. ఇఫీఖిల్లాను రాబందు ఆక్ర మించుకున్నాడేమో అని నాకు అనుమా నంగా వుంది," అంటూ ఒక సైనికుడికేసి తిరిగి, "ఆ శవాన్ని ఒక ఒంటెమీద వేయండి. ఖిల్లావగ్గిర సమాధి చేద్దాం. ఈ రాబందులకు ఆహారంగా అతణ్ణి వదలటం మహాపాపం," అన్నాడు.

కొద్దిసేపట్లోనే పటాలం బయలుదేరింది. ఎడారిలో రేగుతున్న ఎడతెగని యిసుక తుఫా నుల్లో ప్రయాణిస్తూ, సూర్యుడు పశ్చిమానికి దిగుతూండగా, పటాలం ఇఫీఖిల్లాకు కను చూపుమేరలో చేరింది. ఖిల్లా పరిసరాలు నిర్మానుష్యంగా వున్నవి.

హసన్‌గోరీ, పింగళుడికేసి తిరిగి ఆశ్చ ర్యంగా కనుబొమలు ముడివేసి, ఖిల్లావైపుకు చేయిచూపాడు. —(ఇంకా వుంది)





# రాజరిక ప్రభావం

విసుగుచెందని విక్రమార్కుడు మరొకసారి చెట్టు వద్దకు తిరిగి వెళ్లి, చెట్టుకొమ్మను వేళ్ళాడుతున్న శవాన్ని దింపి భుజాన వేసుకుని, మౌనంగా శ్మశానంకేసి బయలుదేరాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు రాజువై వుండికూడా మొహమెరగని ఒక భిక్షువు కోసం ఇంత శ్రమపడటం నిజంగా ప్రశంసనీయమైనవిషయం. ఎందుచేతనంటే సాధారణంగా రాజరికం కృతజ్ఞతనుకూడా పాటించదు. ఇందుకు ఉదాహరణగా వీరసింహుడి కథ చెబుతాను విను," అంటూ ఈకింది కథ చెప్పసాగాడు:

పూర్వం మాళ్వదేశంలో వీరసింహుడనే గొప్ప పరాక్రమశాలి వుండేవాడు. అతను అట్టే ధనికుడుకాడు. అయినా అతను ఏ రాజువద్దా కొలువుచెయ్యక, తన పరాక్రమాన్ని ప్రజలను దొంగలముఠాల నుంచి కాపాడటంలో వినియోగించాడు. సాధార

## బేతాళ కథలు



ఖంగా రాజులకు అడవి మృగాలను వేటాడటం ఎంత ఇష్టమో, వీరసింహుడికి దొంగలను వేటాడటం అంత ఇష్టం.

చిట్టచివరకు మాళ్వదేశపు అరణ్యాలలో ఒక్క దొంగకూడా లేకుండా పోయినదాకా వీరసింహుడు కత్తి దించలేదు. నిజంగా సాహస పరాక్రమాలుగల దొంగలంతా అతనితో తలపడి యుద్ధంచేసి అతని కత్తికి బలి అయారు; చిల్లర దొంగలందరూ ఇతర దేశాలకు పారిపోయారు. ఎన్నో తరాల రాజులుకూడా చేయలేకపోయిన పనిని వీరసింహుడు ఒంటరిగా చేశాడు. అతని పుణ్యమా అంటూ స్త్రీలు సయితం ఒంటరిగా అడవిమార్గాల ప్రయాణంచెయ్యటానికి వసతి ఏర్పడింది. ఆ కారణంచేత మాళ్వదేశంలో వీరసింహుణ్ణి ప్రతి ఒకరూ దేవుడుగా భావిస్తూవచ్చారు.

తన జీవితంలో సగభాగం ప్రజలకు దొంగలబాధ లేకుండా చెయ్యటంలో గడిపినప్పటికీ వీరసింహుడు సంపాదించుకున్నది కీర్తిమాత్రమే. తనపని ముగియగానే అతను తనగ్రామం చేరుకుని అక్కడ తన ఒంటరి జీవితం గడపసాగాడు. ఒంటరి జీవితం ఎందుచేతనంటే అతను పెళ్లాడలేదు; అతనికి అన్నదమ్ము లెవరూ లేరుకూడా. ఒక నౌకరు అతనికి వంటచేసిపెట్టి ఇతర పనులు కూడా చూసేవాడు.

ఒకనాడు వీరసింహుడు తన యింటి సావడిలో కూచుని వంట పూర్తికావటం కోసం నిరీక్షిస్తున్న సమయంలో ఒక మాంత్రికుడు అక్కడికి వచ్చాడు.

"వీరసింహా, నేను చాలా దూరదేశం నుంచి వచ్చాను. కాని ఈ దేశంలో అడుగు పెట్టినప్పటినుంచీ ఎవరినోట విన్నా నీపేరే! అందుచేత నిన్ను చూసిపోదామని వచ్చాను. ఇంత పరాక్రమవంతుడివిగదా, నీకు రాజు కావాలన్న కోరిక ఎన్నడూ కలగలేదా? ఏ పదవీ లేకుండానే ప్రజలకు ఇంత సేవ

చేసినవాడివి పదవికూడా లభిస్తే ఇంకెంత సేవ చేయుగలవో ఊహించు!" అన్నాడు మాంత్రికుడు.

"నేనా విషయం ఎన్నడూ ఆలోచించ లేదు," అన్నాడు వీరసింహుడు.

"అయితే ఇప్పుడు ఆలోచించు!" అన్నాడు మాంత్రికుడు.

"దొంగలు పోయాక నాకు బొత్తిగా పని లేకుండా పోయింది. రాజునైతే బాగానే వుంటుంది. కాని అది ఎలా సాధ్యం?" అన్నాడు వీరసింహుడు.

"ఎవరైనా సాధ్యంచేస్తే వారికి తగిన బహు మానమిస్తావా?" అన్నాడు మాంత్రికుడు.

"ఓ, తప్పక ఇస్తాను!" అన్నాడు వీర సింహుడు.

"నేనే నిన్ను రాజును చేస్తాను. కాని నువు నాకు ఏటా నూరు వరహా లివ్వాలి," అన్నాడు మాంత్రికుడు.

"నూరు వరహాలేనా? వెయ్యి ఇస్తాను కావలిస్తే" అన్నాడు వీరసింహుడు.

"నాకు నూరు వరహాలే కావాలి. అన్న ప్రకారం తప్పకుండా ఇస్తే చాలు," అన్నాడు మాంత్రికుడు. వీరసింహుడు సరేనన్నాడు. మాంత్రికుడు తన మంత్రశక్తివల్ల ఒక్క క్షణంలో చిత్రకూట రాజ్యంలో కిష్కింధా



నగరం చేరుకున్నాడు. కిష్కింధానగరపు రాజు ఆ ఉదయమే మరణించాడు. ఆయనకు మూడేళ్ళవయసుగల కుమారుడు మాత్రం ఉన్నాడు. కిష్కింధ మంత్రు లందరూ సమావేశమై రాజుకొడుకును రాజును చేసి, అతను పెద్దవాడయినదాకా కిష్కింధానగర రాజ్యపాలన తామే చూడా లని నిర్ణయిస్తున్నారు.

సరిగా ఆ సమయానికి మాంత్రికుడక్కడ ప్రత్యక్షమై, "రాజకుమారుణ్ణి సింహాసనం మీద కూచోబెడతాము బాగానేవుంది. కాని చిత్రకూటం మీద ఉన్న దొంగలముఠాల మాట ఏమాలోచించారు? రాజు పసివాడని

తెలిసి వారు ఊరుకుంటారా? కిష్కింధా నగరమంతా దోచెయ్యరా?" అన్నాడు.

"అదీ నిజమే! దీనికేమిటి ఉపాయం?" అన్నారు మంత్రులు మాంత్రికుడితో.

"మాళ్వదేశంలో వీరసింహుడనే పరాక్రమశాలి ఉన్నాడు. అతనంటే ఎంతేసి గజదొంగలకుకూడా సింహస్వప్నం! యువరాజు పెద్దవాడయేదాకా మనం వీరసింహుణ్ణి రాజుగా ఉంచుకున్నామంటే మనరాజ్యానికి దొంగల భయమన్నది లేకుండా చేసేస్తాడు. ప్రజలు సుఖపడతారు. కాలక్రమాన యువరాజు పెద్దవాడై సింహాసనమెక్కుతాడు," అన్నాడు మాంత్రికుడు.

"ఈ పద్ధతి దివ్యంగా ఉన్నది. అయితే ఆ వీరసింహుడు ఎప్పటికి కిష్కింధ చేరేటట్టు?" అన్నారు మంత్రులు.

"ఆ విచారం మీకు వద్దు! మీరు రాజ్యాభిషేక ప్రయత్నాలు చేస్తూఉండండి. ఇక్కడ ఉన్నట్టుగా వీరసింహుణ్ణి తెస్తాను!" అన్నాడు మాంత్రికుడు.

అతను అన్నంతపనీ చేశాడు. ఆ సాయంకాలమే అతను వీరసింహుణ్ణి కిష్కింధకు తెచ్చాడు. మర్నాడు వీరసింహుడు పట్టాభిషేకం చేసుకుని కిష్కింధకు రాజయాడు. దేశాచారం ప్రకారం రాణీ అతనికి భార్య అయింది. ఈ విధంగా, మాంత్రికుడి సహా



యంతో వీరసింహుడు రాజు కావమేగాక, ఒక భార్యనూ, కుమారుణ్ణీకూడా సంపాదించుకుని గృహస్థుకూడా అయాడు.

వీరసింహుడు కిష్కింధకు రాజయాడని తెలియగానే చిత్రకూటపర్వతాన్ని ఆశ్రయించి ఉన్న దొంగల ముఠాలన్నీ ఎక్కడికక్కడ విచ్చిపోయాయి. చిత్రకూట రాజ్యంలో దొంగల భయం లేకుండా పోయింది.

వీరసింహుడికిప్పుడు చేతినిండా పని. ఉదయంనుంచి సాయంకాలందాకా మంత్రులతో కూచుని రాచకార్యాలు చేసేవాడు. మిగిలిన సమయాలలో తన భార్యాబిడ్డలతో కాలక్షేపం చేసేవాడు.

సంవత్సరం గిర్రున తిరిగింది. తన బహుమానం పుచ్చుకోవటానికి మాంత్రికుడు వచ్చాడు. అతన్ని చూడగానే వీరసింహుడు సంచీలో నూరువరహాలు తెప్పించి మాంత్రికుడి చేతిలో పెట్టాడు.

మాంత్రికుడు సంతోషంగా సంచీ తీసుకుని వెళ్లిపోయాడు.

మంత్రులు తమలో తాము గుసగుసలాడుకున్నారు. "రాజుగారిని ప్రతిక్షణమూ కొలిచేవాళ్లం మనమంతా వుండగా ఎవడో పరాయివాడువచ్చి నూరు వరహాలు ముడుపు పుచ్చుకుపోయాడు! ఇదేమైనా బాగుందా?" అనుకున్నారు వారు. వారు రాజుగారితో





ఏమీ అనలేదుగాని, వీరసింహుడు వారి గుస గుసలు గ్రహించాడు.

ఇంకొక ఏడాది జరిగింది. వీరసింహుడు పనిలో నిమగ్నుడై వుండటంవల్ల ఏడాది గడిచినట్టే లేదు. మాంత్రికుడి రాకనుబట్టి ఏడాది గడిచిందని తెలుసుకున్నాడు. కాని కిందటిసారిలాగా మాంత్రికుణ్ణి చూస్తూనే సొమ్ము తెప్పించలేదు.

"నా బహుమానం ఇప్పిస్తారా?" అని అడిగాడు మాంత్రికుడు.

"ఎందు కిప్పించనూ?" అంటూ వీర సింహుడు నూరువరహాలు తెప్పించి వాటిని మాంత్రికుడికి ఇచ్చాడు. తన మంత్రులు గుసగుసలాడుకోవటం అతనికి కనిపించింది. అతను మాంత్రికుడితో, "ఈసారినుంచి ఏటా రావద్దు. ఏడువిడిచి ఏడు వస్తుంటే బాగుంటుం దనుకుంటాను!" అన్నాడు.

"మళ్లీ వచ్చే ఏడు దర్శనం చేసుకుంటాను," అని మాంత్రికుడు వెళ్లిపోయాడు. వీరసింహుడు చేసిన సూచన అతనికి వినిపించినట్టు లేదు.

అన్నప్రకారమే అతను మూడో ఏడు మళ్లీ హాజరయాడు. సరిగా ఆ సమయానికి వీరసింహుడి చుట్టూ మంత్రులు కూచుని ఏదో చర్చిస్తున్నారు.

"నా నూరు వరహాలిచ్చి పంపిస్తారా?" అన్నాడు మాంత్రికుడు.

"దేనికైనా వేళాపాళా ఉండాలి! నేనిప్పుడు చాలా ముఖ్యమైన వ్యవహారాలలో మునిగివున్నాను!" అన్నాడు వీరసింహుడు కొంచెం కోపంగా.

"అతి ముఖ్యమైన వ్యవహారాలు!" అన్నారు మంత్రులు.

"నీ ముష్టి బహుమానం కోసం వచ్చి ఇలా నా గొంతుమీద కూచుంటావనుకోలేదు!" అన్నాడు వీరసింహుడు.

"అచ్చగా అప్పులవాడే!" అన్నారు మంత్రులందరూ.

"నీకు కొంచెంకూడా కృతజ్ఞత అన్నది లేదు!" అన్నాడు వీరసింహుడు.

"నాలుగు తన్ని పంపిస్తేసరి!" అన్నారు మంత్రులు.

"ఇప్పుడు చెయి వీలుగాలేదు. మరెప్పుడైనా రా, చూద్దాం!" అన్నాడు వీరసింహుడు.

"చెప్పేది నీకా్కదూ? వెళ్ళు! ఇక నీముఖం ఇక్కడ ఎన్నటికీ చూపకు! రాజుగారు మంచివారు గనక సరిపోయింది!" అన్నారు మంత్రులు.

"రాజా, మనం మొదటిసారి కలుసుకున్న సమయం జ్ఞాపకం ఉన్నదా?" అన్నాడు మాంత్రికుడు.

"జ్ఞాపకం లేకేం?" అంటూ వీరసింహుడు కళ్ళు మూసుకున్నాడు. తాను వంట పూర్తికావటంకోసం వేచివుండటమూ, మాంత్రికుడు రావటమూ జ్ఞాపకంవచ్చింది. "అరె, పులుసు కాగుతున్న వాసనకూడా స్పష్టంగా తెలుస్తున్నదే!" అనుకుంటూ అతను కళ్ళుతెరిచి దిగ్భ్రమచెందాడు.

కిష్కింధలేదు, మంత్రులులేరు, మాంత్రికుడు లేడు. వీరసింహుడు తన ఇంటనే ఉన్నాడు. అతను చూస్తూండగానే వంట ఇంటోనుంచి నౌకరువచ్చి, "వంట పూర్తి అయింది బాబూ! తమరు భోజనానికి లేవచ్చు!" అన్నాడు.



బేతాళుడీ కథ చెప్పి, "రాజా, వీర సింహుడు ఎందుకు శిక్షించబడ్డాడు ? అతను మాంత్రికుడికి నూరువరహాలు ఏటా యిచ్చే టట్లు వాగ్దానంచేసికూడా అంత నీచంగా ఎందుకు ప్రవర్తించాడు ? స్వతహగా అతను నీచుడుగనకనా ? లేక రాజరికం అతన్ని అలా మార్చిందా ? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల వెయ్యి వక్కలవుతుంది !" అన్నాడు.

"వీరసింహుడు నీచుడు ఎంతమాత్రమూ కాడు. అయినట్టయితే అతను తన జీవిత మంతా ప్రజలకు మేలుచెయ్యటానికి ధార పోయడు. తప్పు రాజరికానిదికూడా కాదు. మాంత్రికుడు వచ్చి రాజును చేస్తానన్న దాకా వీరసింహుడు ఏ పదవికోసమూ పాకు లాడ లేదు. అందుచేత అతనికి పదవీ వ్యామోహం లేదనే అనుకోవాలి. అలాటి వాడు రాజు అయినంతమాత్రాన మారిపోయే అవకాశం లేదు. మారేవాడైతే మొదటనే మారేవాడు. కాని వీరసింహుడిలో మార్పు క్రమంగా వచ్చింది, ఒక్కసారిగా రాలేదు. ఇందుకు కారణం అతని చుట్టూవున్న మంత్రులు. స్వార్థపరుడు కానివాడు ఎప్పుడూ తనచుట్టూవున్న మనుషుల ప్రభా వానికి సులువుగా గురి అవుతాడు. కిష్కింధ మంత్రులు స్వార్థపరులు, నీచులు. కష్ట సమయంలో తమకు సమర్థుడైన రాజును ఇచ్చిన మాంత్రికుడికి ఏటా నూరు వరహా లివ్వటానికి వారు ఎంతో విచారించారు. చిత్రకూటంలో ఉన్న దొంగలనుంచి కిష్కింధను కాపాడినవాడు మాంత్రికుడే. ఆ కృతజ్ఞతకూడా వారికి లేకపోయింది. వీరసింహుడికి రాజరికం పోయినందువల్ల నష్టపడినదికూడా వారే !" అన్నాడు విక్రమార్కుడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# అలీబాబా

( గత సంచిక తరువాయి )

మోర్జియానా సంకోచించకుండా నూనె దుత్త తీసుకుని దొడ్లోకి వెళ్లింది. ఆమె మొదటి తిత్తిని సమీపించేసరికి లోపలి నుంచి దొంగ, "వేళ అయిందా?" అని చిన్నగొంతుతో అడిగాడు. మోర్జియానా మొదట నిర్ఘాంతపోయింది, కాని అంతలోనే గుండె నిబ్బరం తెచ్చుకుని, రహస్యంగా, "ఇంకా లేదు. కొంచెం ఆగు!" అన్నది. వరసగా ముప్పైఏడు తిత్తులూ ఆమెను ఇలాగే పలకరించాయి; ఆమె వాటికి ఈ సమాధానమే చెప్పింది. ఆఖరు తిత్తి మాత్రమే ఏమీ అనలేదు. ఆమె అందులో నుంచి నూనె పోసుకుని ఇంట్లోకి వచ్చేసింది.

తన యజమాని అలీబాబా ముప్పై ఎనిమిదిమంది దొంగలకు ఆశ్రయ మిచ్చి నట్టు మోర్జియానా తెలుసుకున్నది. నూనె వర్తకుడి నంటూ వచ్చినవాడు మిగిలిన వారికి నాయకుడై ఉండాలి. ఆమె దీపంలో చమురు పోసి, పెద్ద బాండా తీసుకుని మళ్లీ నూనెతిత్తి వద్దకు వెళ్లింది. బాండా నిండా నూనె నింపుకుని దాన్ని పెద్ద మంటమీద మరగకాచింది. ఆ మరిగే నూనె తీసుకుపోయి ఒక్కొక్క తిత్తిలోనూ పోసింది. ఏతిత్తిలో దొంగ ఆ తిత్తిలో వేడినూనెకు మగ్గి, ఊపిరాడక చచ్చాడు. ఈవిధంగా ముప్పైఏడుగురు దొంగలనూ నిశ్శబ్దంగా హతమార్చి, సాహసురాలైన మోర్జియానా వంటఇంటికి తిరిగివచ్చి, నూనె కాచటం కోసం పెద్దది చేసిన మంటను తగ్గించి, శోర్వా పండటానికి చాలినంతమాత్రమే ఉంచి, దీపం ఆర్పేసి, ఏం జరుగుతుందో చూడటానికి కిటికీ వద్ద నిలబడింది.

ఆమె దీపం ఆర్పేసిన కొద్దిసేపటికి దొంగల నాయకుడు, ఎక్కడా ఒక దీపం గాని అలికిడిగాని లేకపోవటం గమనించి,

ఆర్. సూర్యనారాయణ

పక్క మీదినుంచి లేచి కిటికీలోనుంచి గులక రాళ్ళు బయటికి రువ్వాడు. వాటిలో కొన్ని తోలుతిత్తులకు తగిలినప్పటికీ ఒక్క దొంగా బయటికి రాలేదు. దొంగలనాయకుడు ఆందోళన చెంది, అడుగులో అడుగు వేసు కుంటూ బయటికి వెళ్ళి, మొదటితిత్తి మూత తెరిచి, "సిద్ధంగా వున్నావా?" అని అడిగాడు. తిత్తిలోనుంచి గుప్పున నూనె వాసన కొట్టింది తప్ప ఏ జవాబూ రాలేదు. తన అనుచరులందరూ హతమైనారని, అలీ బాబాను చంపేందుకు, తాను వేసిన ఎత్తు కాస్తా బయటపడిపోయిందనీ తెలుసుకుని దొంగలనాయకుడు ప్రహరీగోడ దూకి పారిపోయాడు. ఇదంతా చూస్తూవుండిన మోర్జియానా, గదికివెళ్లి పడుకుని, తన యజమానిని గొప్ప ప్రమాదంనుంచి కాపాడానన్న ఆనందంతో సుఖంగా నిద్రపోయింది.

అలీబాబాకు ఈ జరిగిన సంగతు లేవీ తెలియవు. ఆయన తెల్లవారకముందే లేచి, తన బానిసను వెంటబెట్టుకుని స్నానశాలకు వెళ్లిపోయాడు. ఆయన తిరిగివచ్చి కంచర గాడిదలు ఇంకా తన దొడ్డిలోనే వుండటం చూసి మోర్జియానాతో "ఆ నూనెవర్తకు డింకా వెళ్లిపోలేదా?" అన్నాడు.

"యజమానీ, మీరు పూర్తిగా పెరటి దోవనే వున్నారు. నావెంట రండి, అసలు



చూడవలిసింది నేను చూపిస్తాను," అంటూ మోర్జియానా అయనను తోలుతిత్తులున్న చోటికి తీసుకుపోయి మొదటి తిత్తిలోకి చూడమన్నది. అలీబాబా ఆ తోలుతిత్తిలో మనిషి వుండటం చూసి గతుక్కుమన్నాడు.

"భయపడకండి! ఆ మనిషి ఎవరికీ ఏ హానీ చెయ్యలేడు. వాడు చచ్చాడు," అన్నది మోర్జియానా.

"ఇదంతా ఏమిటి, మోర్జియానా?" అన్నాడు అలీబాబా విచారంగా.

"మీరు గట్టిగా మాట్లాడకండి. ఇది పరమ రహస్యం. ఇరుగుపొరుగువాళ్లకు తెలియ గూడదు. ఈ తిత్తులన్నీ వరసగా చూడండి," అన్నది మోర్జియానా. అన్ని తిత్తులూ చూశాక అలీబాబా ఆశ్చర్యానికి అంతు లేకుండాపోయింది.

"ఆ నూనెవర్తకు డేమయాడు?" అన్నాడు అలీబాబా.

"నేనెంత వర్తకుణ్ణో వాడూ అంతే వర్తకుడు. మీరు ముందు శోర్బా తీసుకోండి. నేను జరిగినదంతా చెబుతాను," అన్నది మోర్జియానా. తరవాత ఆమె తాను తల వాకిలి తలుపుమీద తెల్లగుర్తు చూడటం లగాయతు దొంగల నాయకుడు పారిపోవటం దాకా జరిగిన విషయాలన్నీ వివరంగా తన యజమానికి చెప్పింది.





అంతా విని అలీబాబా, "మోర్జియానా, నువు అడ్డుపడకపోతే ఈ దొంగలు నన్ను నిజంగా నాశనం చేసి ఉందురు. ప్రాణ దానం చేసిన నీ రుణం కొంత తీర్చుకునే టందుకు నిన్ను బానిసత్వంనుంచి విముక్తి చేస్తున్నాను. మిగిలిన రుణం తీర్చుకునే ఏర్పాట్లు తరవాత చూస్తాను!" అన్నాడు.

అలీబాబా తోట చాలా నిడివి అయినది. దాని చివర చాలా ఎత్తయిన పెద్ద చెట్లు న్నాయి. ఈ చెట్ల మధ్యగా అలీబాబా, అబ్దుల్లా కలిసి ఒక పొడుగైన కందకం తవ్వి, అందులో దొంగలతో సహా తోలుతిత్తు లన్నిటినీ పూడ్చేశారు. తరవాత అలీబాబా కంచరగాడిదలను ఒక్కొక్కటిగా సంతకు పంపించి అమ్మించే శాడు.

అలీబాబా ఇంటినుంచి పారిపోయిన దొంగల నాయకుడు గుండెలు మండిపోతూ అడవిలోకి తిరిగి వెళ్ళాడు. తన అనుచరు లంతా పోయిన కారణంచేత దొంగల గుహ బావురుమంటున్నది. అక్కడ కొద్దిసేపు ఉండేసరికల్లా భయంవేసి అతను నగరానికి తిరిగి వచ్చాడు. తిరిగివస్తూ అలీబాబాను హతమార్చి తన అనుచరుల తరఫున పగ తీర్చుకుంటానని ప్రతిజ్ఞ తీసుకున్నాడు.

ఇందుకుగాను దొంగల నాయకుడు బట్టల వ్యాపారి వేషం ధరించి కొజియా హుసేన్ అని పేరు పెట్టుకున్నాడు. అతను నగరంలో ఒక ఇల్లు అద్దెకు తీసుకుని, ఎవరూ చూడకుండా తమ గుహనుంచి పట్టుతానులు తెచ్చి అందులో పేర్చాడు. అలీబాబా పెద్ద కొడుకు ప్రస్తుతం చూస్తున్న కాసిం దుకా ణాని కెదురుగా దొంగలనాయకు డొక గిడ్డంగి అద్దెకు తీసుకున్నాడు.

కొత్తగా వచ్చిన వర్తకుడు పాత వర్త కులను మర్యాదగా చూడటం ఆచారం. ఈ ఆచారాన్ని దొంగల నాయకుడు పాటించాడు. అతను ముందుగానే అలీబాబా కొడుకుతో స్నేహం కలిపాడు. రెండుమూడు రోజుల

అనంతరం అతను తన ఎదురుగా వున్న దుకాణంలో అలీబాబాను చూసి వెంటనే గుర్తు పట్టాడు. అలీబాబా తన తండ్రి అని కొత్తస్నేహితుడు చెప్పినమీదట దొంగల నాయకుడు ఆ స్నేహితుడితో మరింత స్నేహంగా ఉంటూ, ప్రేమగా సంభాషించ టమూ, చిన్న చిన్న బహుమానాలివ్వటమూ, చీటికీ మాటికీ భోజనానికి పిలవటమూ మొదలైన పనులు చేయసాగాడు.

ఇదంతా చూసి అలీబాబా కొడుకు తన తండ్రితో, "ఈ కోజియా హుసేన్ నాకు అనేక రకాల మర్యాదలు చూపుతున్నాడు. మనం అతన్ని మన ఇంటికి ఆహ్వానిస్తే బాగుంటుంది," అన్నాడు.

"నాయనా, రేపు శుక్రవారం, దుకాణాలు మూసే రోజు. అందుచేత అతన్ని వెంట బెట్టుకురా. భోజనం తయారుచేయమని నేను మోర్జియానాతో చెబుతాను," అన్నాడు అలీబాబా సంతోషంగా.

అలీబాబా కొడుకు ఆ ప్రకారమే కోజియా హుసేన్‌ను వెంటబెట్టుకుని అలీబాబా ఇంటి దాకా తీసుకువచ్చి, "ఇదే మా నాన్న వుండే ఇల్లు. మన స్నేహం మాట విని ఆయన నిన్ను తప్పక భోజనానికి తీసుకురమ్మ న్నాడు," అన్నాడు.



దొంగల నాయకుడికి కావలిసింది ఏదో మిషమీద అలీబాబా ఇంట్లో ప్రవేశించి అలీ బాబాను చంపటమే. అయినప్పటికీ అతను వెనక్కు తీసి, రానంటే రానని భీష్మించాడు. కాని ఇంతలోనే నౌకరు వచ్చి తలుపు తీశాడు. అలీబాబా కొడుకు అతన్ని బలవం తంగా లోపలికి తీసుకుపోయాడు.

అలీబాబా కోజియా హుసేన్ తన కొడుకు పట్ల చూపిన స్నేహభావాన్ని కొనియాడాడు. "మావాడు ఇంకా చిన్నవాడు. వాడికి ప్రపంచజ్ఞానం తక్కువ. మీవంటివాళ్ల నుంచి నేర్చుకోవలిసింది చాలా వుంది," అన్నాడాయన దొంగలనాయకుడితో.

"మీవాడికి ప్రపంచజ్ఞానం తక్కువ కావచ్చుగాని బుద్ధిబలంలో వయసు మళ్లిన వారికి ఏమీ తీసిపోడులెండి!" అన్నాడు కోజియా హుసేన్.

వారా విధంగా కాస్సేపు మాట్లాడుకున్నాక కోజియా హుసేన్ లేచి, వెళ్లివస్తానన్నాడు. అలీబాబా ఆదుర్దాగా, "అదేమిటి? మీరీ పూట నాతో కూచుని భోజనం చెయ్యాలి. మీరు మాకు అప్తులు. మాది పేదభోజనమే అయినా అదే మీకు్కూడా పెట్టకుండా పోనివ్వను," అన్నాడు.

"నేను ఉప్పువేసిన పదార్థాలు ముట్టను. అందుచేత నన్ను నిర్బంధించక వెళ్లనివ్వండి!" అన్నాడు కోజియా హుసేన్.

"నాకుకూడా ఉప్పు సయించదు. మీకు కావలిసినట్టుగానే భోజనం పెట్టిస్తాను. ఉండండి!" అంటూ అలీబాబా వెళ్లి మోర్జియానాతో, "మోర్జియానా, మన కొక అతిథి వచ్చాడు. అతను ఉప్పు తినడు. అందుచేత అతనికోసం వెంటనే చప్పిడిభోజనం తయారుచెయ్యి!" అన్నాడు.

మోర్జియానా ముఖం చిట్లించి, "ఎవరీ వింతమనిషి? ఈ చప్పిడివంట పూర్తి అయేలోగా మీ భోజనం చప్పగా చల్లారి పోతుంది," అన్నది. అందుకు అలీబాబా నవ్వుతూ, "కోప్పడకు, మోర్జియానా, అతను



మనకు కావలిసిన వాడు. నేను చెప్పినట్టు చెయ్యి," అన్నాడు

మోర్జియానా చప్పిడివంట తయారు చేసి వడ్డించే సమయంలో అబ్దుల్లా వెంట తానుకూడా వడ్డనకు వచ్చింది. కోజియా హుసేన్‌ను చూడగానే ఆమె దొంగలనాయకుణ్ణి పోల్చేసింది. అంతేకాదు, అతని అంగరఖా అడుగునవున్న బాకు పిడికూడా ఆమెకంట పడింది.

వడ్డన పూర్తికాగానే ఆమె నృత్యంచేసే దుస్తులు ధరించి, తన బొడ్డులోకూడా ఒక బాకు పెట్టుకుని, కంజరీ ఒకటి తీసుకు రమ్మని అబ్దుల్లాకు చెప్పింది. వారు వచ్చే సరికి అలీబాబా, ఆయన కొడుకూ దొంగల నాయకుడూ ఇంకా భోజనం ముగించలేదు.

"రా, మోర్జియానా! నీ నృత్యం అతిథికి చూపించు!" అన్నాడు అలీబాబా.

ఆమె చాలాసేపు బాకు పట్టుకుని నృత్యం చేసింది. నృత్యం చేసేటప్పుడు చాలాసార్లు తనను తాను పొడుచుకునేలాగా అభినయించింది. నృత్యం పూర్తి అయాక అబ్దుల్లాను వెంట పెట్టుకుని బహుమానం కోసం వచ్చింది. అలీబాబా కంజరీలో ఒక దీనారం వేశాడు. అలీబాబా కొడుకు మరొక దీనారం వేశాడు. అబ్దుల్లా కంజరీపట్టుకుని దొంగలనాయకుడి దగ్గిరికి వచ్చాడు. దొంగల



నాయకుడు డబ్బుసంచీకోసం జేబులో చెయ్యిపెట్టాడు. సరిగా ఆసమయంలో మోర్జి యానా దొంగలనాయకుణ్ణి బాకుతో గుండెలో పొడిచేసింది.

అలీబాబా చివాలున లేచి ఆక్రోశిస్తూ, "ఎంతపని చేశావు మోర్జియానా!" అన్నాడు.

"మీరు తొందరపడకండి. వీడు బట్టల వర్తకుడే కాదు, నూనెవర్తకుడుకూడా వీడే, దొంగలనాయకుడూ వీడే! వీడి బొడ్డులో బాకు చూడండి! మిమ్మల్ని కడతేర్చటానికే తెచ్చాడు. వీడు మీ ఉప్పు తిననని ఎప్పుడన్నాడో అప్పుడే నాకు అనుమానం తగిలింది. అందుకే వడ్డన నెపంమీద వచ్చి వీణ్ణి చూసి, వెంటనే గుర్తించాను! ఇవాళ మీరు లేచినవేళ మంచిది!" అన్నది మోర్జియానా.

"మోర్జియానా, నీ ఋణం నిజంగా తీరదు. నీకు అదివరకే స్వేచ్ఛ ఇచ్చాను. ఇప్పుడు నిన్ను నా కోడలిని చేసుకుంటాను!" అన్నాడు అలీబాబా.

అలీబాబా కొడుకు మోర్జియానాను పెళ్లాడటానికి సంతోషంగా ఒప్పుకున్నాడు.

మిగిలిన దొంగలను పాతేసినట్టే దొంగల నాయకుణ్ణికూడా రహస్యంగా పాతేశారు. ఇప్పుడు అడవిలో వున్న గుహ రహస్యం తెలిసినవాడు అలీబాబా ఒక్కడే. కాని మరి ఇద్దరు దొంగలు బతికిఉన్నారన్న అనుమానంతో ఒక ఏడాదిపాటు అలీబాబా ఆ గుహ ప్రాంతాలకు పోలేదు.

ఒక ఏడాదిపాటు తనకెవరూ హానిచేయ యత్నించక పోవటం చూసి ఆయన ఒక నాడు గుహకు వెళ్ళాడు. అక్కడ ఏడాదిగా ఎవరూ అడుగు పెట్టిన జాడలేదు.

కాలక్రమాన అలీబాబా ఈ గుహ రహస్యాన్ని తన కొడుక్కు చెప్పాడు. తరవాత చాలా తరాలవారు ఆ గుహ తాలూకు రహస్యం తమ తండ్రులవద్దనుండి తెలుసుకుని ఆ గుహనుంచి తెచ్చిన సంపదతో సుఖంగా బతికారు. —(ఐపోయింది)



# గయ్యాళి భార్యలు

ఒకేరోజున ఇద్దరు మనుషులు చచ్చిపోయి చిత్రగుప్తుడి ఎదట నిలబడ్డారు. చిత్రగుప్తుడు మొదటివాడికేసి తిరిగి, "నువు ఏమేం పాపాలు చేశావు?" అని అడిగాడు.

"చెయ్యకేం, బాబూ? చిల్లర పాపాలు చాలా చేశాను. చేసిన పాపాలకు శిక్ష తప్పుతుందా? ఎంతకాలం నరకంలో ఉండాలో సెలవియ్యండి," అన్నాడా మనిషి.

చిత్రగుప్తుడు నవ్వి, "నువు గయ్యాళికామమ్మ మొగుడివికాదూ? నువు అనుభవించవలసిన నరకమంతా భూమిమీదనే అనుభవించావు. నువ్వింక స్వర్గానికి వెళ్లవచ్చు!" అన్నాడు.

దేవతలు వచ్చి ఆ మనిషిని స్వర్గానికి తీసుకుపోయారు.

తరవాత రెండోవాడు చిత్రగుప్తుడితో, "అయ్యా, ఒక్క గయ్యాళిభార్యతో కాపరం చేసినవాడికే మీరు స్వర్గం ఇప్పిస్తే నాకేమిప్పిస్తారో చెప్పండి. నేను వరసగా ముగ్గురు భార్యలను చేసుకున్నాను. ముగ్గురూ ముగ్గురే—మూడు గచ్చపొదలు," అన్నాడు.

చిత్రగుప్తుడు యమభటులను పిలిచి, "ఇతన్ని నరకానికి తీసుకుపోండి!" అన్నాడు.

"అయ్యా, అన్యాయం!" అన్నాడా మనిషి.

"ఓయీ, స్వర్గం అదృష్టహీనులకోసం ఏర్పాటయిందిగాని, బుద్ధిహీనులకోసం కాదు!" అని చిత్రగుప్తుడు జవాబిచ్చాడు.






# 6

[తన కుమార్తెను అలాదీన్‌కిచ్చి చేస్తానని మాటఇచ్చి మూడునెలలు గడువడిగిన రాజుగారు మంత్రిమాటలు విని, అన్నమాట కాస్తా తప్పి, గడువులోపలనే తన కుమార్తెను మంత్రి కొడుకుకిచ్చి పెళ్ళిచేసేశాడు. ఈ సంగతి తెలిసి అలాదీన్ దీపంభూతం సహాయంతో పెళ్లి నిష్ఫలమయేటట్టు చేశాడు. పెళ్లి రద్దయిపోయింది. పెళ్లివినోదాలన్నీ కట్టిపెట్టబడ్డాయి.]

రాజుకూతురు బుదూర్‌కూ మంత్రికొడుకుకూ జరిగిన పెళ్లి రద్దయిపోయిందనీ, రాజుగారు మంత్రికొడుకును దూరప్రాంతానికి పంపేశారనీ ప్రజలందరికీ తెలిసిపోయింది. ఈ సంగతి విని అలాదీన్ ఎంతో సంతోషించాడు, తన దీపాన్ని మెచ్చుకున్నాడు. రాజకుమార్తె వివాహం ఎలా భగ్నమయినదీ తనకు తప్ప ఇంకొక సరమానవుడికి తెలియదు, అందుకుకూడా అతను చాలా సంతోషించాడు.

త్వరలోనే రాజుగారు పెట్టిన మూడు నెలల గడువు పూర్తిఅయింది. అలాదీన్ తన తల్లిని రాజుగారి దర్శనంకోసం వెళ్ళమన్నాడు. ఆమె తనకు గల దుస్తులన్నిటిలోకీ మంచివి ధరించి రాజసభకు వెళ్లింది.

ఆమె సభలో అడుగుపెడుతూండగానే రాజుగారు ఆమెను గుర్తించాడు. ఆయన తన మంత్రితో, "అలాదీన్ తల్లి వస్తున్నది. గడువు తీరింది గనక అమ్మాయిని తన కుమారుడికిచ్చి చెయ్యమంటుందను

బి. ప్రసాదరావు

కుంటాను. మూడు నెలలు గడువు పెట్టిన సంగతి నాకు జ్ఞాపకం రావటం మంచి దయింది," అన్నాడు.

మంత్రి తనకు జరిగిన అవమానాన్ని ఇంకా మరవలేదు. ఆయన రాజుతో, "మహారాజా, తమవంటివారు ఆడినమాట తప్పకపోవటం మంచిదేగాని, చేసుకోబోయే అల్లుణ్ణి గురించి కొంతలోకొంత తెలిసి ఉండటంకూడా అవసరమే. బొత్తిగా ముక్కూ మొహమూ ఎరగనివాడికి పిల్ల నెలా ఇస్తారు? ఈ అలాదీన్ గురించి నాకు తెలుసుగాని మీకు బొత్తిగా ఏమీ తెలియదు. ఇతని తండ్రి ఒక పేద దర్జీవాడు. పేదరికం తోనే మరణించాడు. అలాటివాడి కొడుకు సంపన్నుడని ఎలా నమ్మటం?" అన్నాడు.

"దేవుడు కరుణిస్తే ఎవడైనా సంపన్నుడు కావచ్చు," అన్నాడు రాజు.

"అలా జరిగిందనైనా మనకు దాఖలా ఉండాలిగా! నాసలహా ఏమంటే, ఈ అలాదీన్‌ను పెద్ద ఎత్తున కట్నం అడగండి. అతను తీసుకురాగలిగిననాడు మనం కళ్లు మూసుకుని ఈ సంబంధానికి ఒప్పుకోవచ్చు," అన్నాడు మంత్రి.

"నువు చెప్పింది దివ్యంగా ఉంది, మంత్రీ. ఆ ముసలావిణ్ణి ముందుకు



రమ్మను," అన్నాడు రాజు. మంత్రి పిలవ గానే అలాదీన్ తల్లి రాజుగారిని సమీపించి ప్రణామం చేసింది.

"మేము చేసిన వాగ్దానాన్ని మరిచి పోలేదని అక్కగారు తెలుసుకోవాలి. అయితే మనం లోగడ పెళ్ళికూతురి కట్నకానుక లను గురించి మాట్లాడుకుని ఉండలేదు. పెళ్ళి కూతురు రాజకుమార్తె అనీ, గొప్ప పుటక పుట్టినదనీ అక్కగారు మరిచిపోరాదు. పెళ్ళికూతురి కట్నంలో ఏమేమి ఉండా లంటేః—నలభై పోతబంగారం పళ్లాలనిండా రత్నాలు రాసులు పొయ్యాలి. ఆ రత్నాలు కూడా పూర్వం నాకు కానుకగా ఇచ్చిన





వాటిలాటివే అయిఉండాలి. ఈ నలభై పళ్ళాలనూ నలభైమంది అప్సరసలవంటి ఆడబానిసలు రాజభవనానికి పట్టుకు రావాలి. వారివెంబడి నలభైమంది నల్ల బానిసలు పహరా రావాలి. ఈ కట్నాలు తెచ్చి మాముందు పెట్టిన మరుక్షణం పెళ్ళి ఖరారు అవుతుంది. అదివరకే మీ కుమారుడు నాకు కానుక పంపిఉన్న కారణం చేత నేనింతకన్న ఎక్కువ కోరదలచలేదు!" అన్నాడు రాజుగారు.

ఈ కోరిక వినగానే అలాదీన్ తల్లికి గుండె ఆగిపోయినంత పని అయింది. ఆమె రాజుగారికి మళ్లీ ప్రణామం చేసి మారుమాట లేకుండా తిరిగి వచ్చేసింది. ఆమె ఇంట్లో అడుగు పెడుతూనే అలాదీన్‌తో, "ఈ రాజకుమార్తె ప్రమేయం మనకు వద్దని నేను అప్పుడే చెప్పలేదుట్రా?" అన్నది.

ఆమె అలాదీన్‌తో రాజుగారన్న మాటలు చెప్పి, "పోనీ బంగారుపళ్లాలూ, రత్నాలూ అంటే నేనూ ఒప్పుకుంటాను. నువు అసలే పిచ్చిలో ఉన్నావు గనక ఆ భూగర్భంలో ఉన్న గుహకు వెళ్ళి చెట్లమీద కాసే రత్నాలు ఒలిచి తెస్తావు. కాని నలభైమంది ఆడ బానిసలనూ, నలభైమంది మగబానిసలనూ తెమ్మంటే అది మనవల్ల అయే పనేనా, నాయనా? నువు మాత్రం ఎక్కణ్ణుంచి తెస్తావు? ఆ ముచ్చముండాకొడుకు చెవిలో ఏదో ఊదబట్టే రాజు ఇంత కట్నం అడిగాడు. కనుక ఈ ప్రయత్నం మానుకో, బాబూ. లేకపోతే ఊబిలో దిగబడిపోయి నట్టవుతుంది నీపని!" అన్నది.

అలాదీన్ ఈ మాటలకు నవ్వాడు. "అమ్మా, రాగానే నీ మొహం చూసి నిజంగా చెడువార్తే తెచ్చావని భయపడ్డాను. కాని నువు ఉత్తపుణ్యానికి కంగారుపడుతున్నావని నాకిప్పుడు తెలిసిపోయింది. నేనివ్వగలదానిలో రాజుగారడిగినది ఎన్నోవంతు! అందుచేత నువు నీ పిచ్చి అను





మూనాలన్నీ కట్టిపెట్టి ముందు వంటచెయ్యి. నాకు ఆకలి దహించుకుపోతున్నది. ఇక రాజుగారి మాటంటావా, అదంతా నేను చూసుకుంటాలే!" అన్నాడతను తల్లితో.

తల్లి తన పనిమీద అవతలికి వెళ్ళగానే అలాదీన్ తన గదితలుపు గడియ పెట్టి, లాంతరు తీసి రుద్దాడు. వెంటనే భూతం ప్రత్యక్షమై, "ఏం సెలవు?" అన్నది.

అలాదీన్ భూతంతో రాజుగారు కోరిన కట్నంమాట చెప్పి, నలభై పోతబంగారపు పళ్ళాలనిండా రత్నాలనూ, నలభైమంది ఆడబానిసలనూ, మగబానిసలనూ హాజరు పెట్టమని ఆజ్ఞాపించాడు.

భూతం అదృశ్యమై మరుక్షణమే అలాదీన్ కోరిన వాటితోసహా హాజరయింది. నలభైమంది ఆడబానిసలనూ గోడవెంబడి, నెత్తిన పోతబంగారు పళ్ళాలతోసహా, వాటి నిండా పెద్దపెద్ద రత్నాలతోసహా, నిలబెట్టి అలాదీన్‌కు చూపించింది. నలభైమంది మగ బానిసలుకూడా ఉన్నారు. అన్నీ సరిచూసుకుని అలాదీన్ భూతాన్ని పంపేశాడు.

సరిగా ఈ సమయానికే అలాదీన్ తల్లి వంటసామగ్రితో తిరిగివచ్చి తన ఇంటి ముందు మూగిన మగబానిసలను చూసి, తన కొడుకును దండించటానికిగాను రాజు




గారు పంపారని హడిలిపోయింది. కాని అంతలోనే అలాదీన్ ఆమెను సమీపించి, "అమ్మా, నీకు మళ్ళీ ప్రయాణం తగిలింది. ఈ బానిసలనూ, కట్నాలనూ తీసుకుని మళ్ళీ రాజుగారిని చూడాలి," అన్నాడు.

ఆమెకిప్పుడు నిజం తెలిసింది. ఆమె బానిసలను వెంటబెట్టుకుని బయలుదేరింది. ఈ వింతఊరేగింపును చూడటానికి జనం ఎగబడసాగారు. అలాదీన్ తల్లి రాజభవనం చేరేసరికి వీధులు పట్టనంతమంది జనం ఊరేగింపు వెంట చేరారు. ఏం జరుగుతున్నదో ఎవరికీ తెలియదు. అంచేత ప్రజలు కోలాహలంగా మాట్లాడుకుంటూ ఎవరిచిత్తం



51

వచ్చినట్టు వాళ్ళు కథలు అల్లేస్తున్నారు. అందగత్తెలైన బానిసలూ, వారినెత్తిన ధగ ధగలాడే బంగారుపళ్ళాలూ, వాటిలో కుప్పలుగా పోసి కిరణాలు వెదజల్లుతున్న అపూర్వమైన రత్నాలూ—ఇవి మాత్రం ప్రతిఒక్కరికీ అర్థమయాయి. ఈ వైభవమంతా చూసి కొందరు, ఎవరో గొప్ప రాజుగారు నగరానికి వచ్చారని పుకారు లేవదీశారు.

ఆడబానిసలు రాజద్వారం ప్రవేశించేటప్పుడు ద్వారరక్షకులు వారిని ఆపటానికి ప్రయత్నించకపోగా, కంగారుపడి పక్కకు తొలిగి దారిఇచ్చారు. రక్షకభట నాయకుడు మొదటి నీగ్రోబానిసను చూడగానే నీగ్రోల చక్రవర్తి అనుకుని, వంగి సలాము చేశాడు! నీగ్రోవాడు నవ్వి, "నేను బానిసను. నా యజమాని వెనకగా రాబోతాడు!" అన్నాడు.

సభలో వివిధవిషయాలు చర్చిస్తున్న రాజుగారు అంత దూరాన బానిసల బారు చూడగానే సభ చాలించి, వచ్చినవారిని తనవద్దకు పంపమని ఉత్తరువిచ్చాడు. బానిసలు వచ్చి సింహాసనముందు అర్ధచంద్రాకారంలో నిలబడ్డారు. పళ్లాలను దింపటానికి ఆడబానిసలకు మగబానిసలు సహాయం చేశారు. తరవాత ఎనభైమంది బానిసలూ రాజుగారి ముందు సాష్టాంగపడి లేచి, చేతులు కట్టుకు నిలబడ్డారు.



ఇదంతా జరిగాక అలాదీన్ తల్లి ముందుకు వచ్చి, రాజుగారికి ప్రణామం చేసి, "మహారాజా, మీ సేవకుడు అలాదీన్ రాజకుమార్తెకు పంపిన కట్నం స్వీకరించండి. రాజకుమార్తెకు తగిన కట్నం తమరు కోరనేలేదని మావాడు తమతో మనవి చెయ్యమన్నాడు. కాని తమరు ప్రస్తుతానికి ఈ స్వల్పకానుక స్వీకరించినట్టయితే ముందుముందు దీన్ని మించే కానుకలు వస్తాయన్నాడు," అన్నది.

రాజుగారికి మతిపోయింది. ఆయన సింహాసనంమీద చేరగిలబడి, నోటమాటలేక రత్నరాసులకేసీ, బానిసలకేసీ బిత్తరపోయి చూస్తూ, అలాదీన్ తల్లి అన్న మాటలు కూడా సరిగా వినలేకపోయాడు. చిట్టచివరకాయన మంత్రికేసి తిరిగి, "మంత్రీ, ఈ సంపదముందు మనసంపద దివిటీముందు దీపంగదా! మనమాట మననోట ఉండగానే ఇలాటి కట్నం పంపినవాణ్ణి గురించి ఏమనుకోవాలి! ఈ వైభవం ముందు అమ్మాయి ఎంత?" అన్నాడు.

రాజుగారి మాటలకు ఎదురు చెప్పే ధైర్యం మంత్రికి లేదు. అయినా ఆయన, "అలా అనకండి, మహారాజా. ఈ రత్నరాసులెంత విలవైనవయినా అమ్మాయిగారి విలవ ఇంకా హెచ్చు," అన్నాడు.







"ఒక్కనాటికి కాదు. అంతేకాదు, నేను అమ్మాయిని ఈ అలాదీన్‌కిచ్చి పెళ్ళిచేస్తే, ముందూ వెనకా ఆలోచించక అకార్యం చేశానని నువు అనలేవుకూడా!" అన్నాడు రాజు. ఆయన తనచుట్టూ మూగిన సభికులకేసి ప్రశ్నార్థకంగా చూశాడు. వారు ఏకగ్రీవంగా తలలు వంచి, రాజుగారి అభిప్రాయం సరిఅయినదని సూచించారు.

రాజుగారు ఇక సందేహించలేదు. అలాదీన్ తన కుమార్తెకు ఎలాటి భర్త అవుతాడో అన్న అనుమానంకూడా ఆయనకు కలగలేదు. ఆయన అలాదీన్ తల్లికేసి తిరిగి, "అక్కగారూ, ఈ క్షణంనుంచీ నీ కొడుకు అలాదీన్ నాతో సమమైన వంశగౌరవం గలవాడు, నా బంధుకోటిలో వాడు. అతన్ని ఎప్పుడు ఆలింగనం చేసుకుంటానా, ఎప్పుడు నా కుమార్తెనిచ్చి పెళ్ళిచేస్తానా అని తహతహలాడిపోతున్నాను!" అన్నాడు.

అలాదీన్ తల్లి రాజుగారివద్ద సెలవు తీసుకుని వాయువేగంతో ఇంటికి తిరిగి వచ్చి, కొడుకుతో జరిగినదంతా చెప్పింది.

తాను ఎంతో ప్రయాసపడ్డమీదట తన కోరిక సిద్ధించినందుకు అలాదీన్‌కు పరమానందమయింది. కాని అతను ఈ ఆనందాన్ని పైకి కనబరచక, "అమ్మా, ఈశ్వరుడి అనుగ్రహంవల్లా, నీ ఆశీర్వచనంవల్లా, నువు పడిన శ్రమవల్లా ఇది సాధ్యమయింది," అని తల్లికి తన కృతజ్ఞత తెలుపుకుని, రాజుగారిని చూడబోవటానికి ప్రయత్నాలు ప్రారంభించాడు.

అతను ఒంటరిగా తన గదిలోకి వెళ్ళి మరోసారి దీపంభూతాన్ని రప్పించాడు. భూతం రాగానే అతను, "భూతమా, నా చేత చక్కగా స్నానం చేయించి, ప్రపంచంలో ఏ మహారాజుకూ లేని ఉడుపులు కట్టబెట్టు!" అన్నాడు.

భూతం అతన్ని తన భుజాలమీద ఎక్కించుకుని ఒక్కక్షణంలో ఒక స్నాన



శాలలో దింపింది. అటువంటి అద్భుతమైన స్నానశాల ప్రపంచంలో ఎక్కడా లేదు. అది స్ఫటికంలాటి చలవరాతితో నిర్మించినది. అందులోని స్నానాల తొట్లు రోజా రంగు యమునారాళ్ళతోనూ, తెల్లని పగడపు రాళ్ళతోనూ కట్టారు. వాటిచుట్టూ నవరత్నాలు పొదిగారు. అక్కడ అనేక భూతాలు అలాదీన్‌కు ఒళ్ళుపట్టి, పన్నీట స్నానం చేయించాయి. దీని ఫలితంగా అతని శరీరానికి గులాబీపువ్వు చాయ వచ్చింది.

తరవాత అతనికి అపూర్వమైన దుస్తులు తెచ్చి ఇచ్చారు. వాటి అందం వర్ణనాతీతం. వాటిని ధరించి అలాదీన్ ఏ స్వర్గంనుంచో భూమికి దిగిన దేవరాజకుమారుడల్లే వున్నాడు. భూతం అతన్ని తిరిగి ఇంటికి తెచ్చి చేర్చింది.

అలాదీన్ భూతంతో, "నాకిప్పుడొక మేలు జాతిగుర్రం కావాలి. అలాటి గుర్రం రాజు గారి దగ్గిరకూడా ఉండకూడదు. దానిపైన లక్ష దీనారాల విలవగల జీనుండాలి. నాకు నలభైఎనిమిదిమంది బానిసలు కావాలి. వారందరికీ అందమైన దుస్తులుండాలి. వారిలో సగంమంది నాకు ముందూ, మిగిలిన వాళ్ళు నావెనకా, రెండు బారులుగా ఏర్పడి నడుస్తారు. మా అమ్మకు పన్నెండుమంది అత్యంత సౌందర్యవతులైన ఆడ బానిసలు



కావాలి. పన్నెండుమందీ పన్నెండు రంగుల బట్టలు రాజకుమార్తెకోసం తీసుకురావాలి. నా బానిసలలో ప్రతి ఒక్కడిదగ్గిరా అయిదేసివేల దీనారాల సంచీ ఉంచు, నాఖర్చుకు కావాలి. ప్రస్తుతానికి ఇదే నీవల్ల నాకు కావలిసింది," అన్నాడు.

మరుక్షణంలో అలాదీన్ కోరినవన్నీ హాజరయాయి. అతను గుర్రంమీద ఎక్కి కూచున్నాడు. అంతకుపూర్వం అతను ఎన్నడూ గుర్రపుస్వారి చేసి ఎరగడు, అయినా అతని కది కొత్త అనిపించలేదు. అతను కదలగానే ముందూ, వెనకా నిలబడి ఉన్న బానిసలుకూడా కదిలారు.

అతను వీధులవెంట పోతుంటే మళ్లీ జనం మూగారు. ఇళ్ల కప్పులపైన, కిటికీల వద్దా జనం చేరి ఈ ఊరేగింపు చూడసాగారు. అలాదీన్ ఆజ్ఞప్రకారం బానిసలు, వీధుల నిండా కిటకిటలాడే జనంమీద బంగారం విదజల్లారు. దారిపొడుగునా జనం అలాదీన్ అందాన్నీ, వైభవాన్నీ వెయ్యికళ్లతో చూసి ఆనందించారు.

అతను వస్తున్నాడన్న వార్త రాజుగారికి ముందుగానే తెలిసింది. ఆయన అలాదీన్‌కు స్వాగతం చెప్పటానికి వేచిఉన్నాడు. అలాదీన్‌ను చూడగానే రాజుగారికి అతని విలవైన దుస్తులూ, ఠీవీ కొట్టవచ్చినట్టు కనపడ్డాయి. ఆయన అతన్ని ఆలింగనం చేసుకున్నాడు. చుట్టూ ఉన్న రాజపరివారంలో వారందరూ పెద్దపెట్టున హర్షధ్వానాలు చేశారు. బాజాలు మోగాయి.

రాజుగారు అలాదీన్‌ను నడిపించుకుని సన్మానభవనానికి తీసుకుపోయి తన పక్కనే కూచోబెట్టుకుని, "అలాదీన్, నీ పెళ్లికి మూడు మాసాలు గడువు అడిగినందుకు విచారిస్తున్నాను. నిన్ను అల్లుడుగా చేసుకునేటందుకు ఎగిరి గంతువెయ్యని మహారాజు ప్రపంచంలో ఉంటాడనుకోను!" అన్నాడు. —(ఇంకా ఉంది)






సన్యాసు లిద్దఱు - చయ్యన త్రవ్వి
అన్యాయముగ నిధి - నట తిలకించి
తీసుక పోయిరి - తిన్నగా వారు
వాసి వన్నెయు లేక - వఱలె నా బిలము
ధననిధి పోవ నా - దర్పమ్ము తఱిగె
ధనము పోవగ బల-మ్మును పోయె నాకు
చూతమ టంచు నా - చుట్టాల గలిసి
ఆ తాపసి మఠమ్ము - నటు చొచ్చి పోతి
ఎంతగా ఎగిరిన - ఏమి లాభమ్ము
నుంతైన గుంజను - సోకనే లేను.
అప్పుడా సన్యాసి - అనె మిత్రుతోడ
"చప్పుడు కేమిలే - చచ్చె నీ యెల్క
కోఱలు దీసిన - కోడె నాగేల ?
సారమ్ము లేనట్టి - సామజ మేల ?
విత్తమ్ము లేనట్టి - వీఱడి యల్లె
సత్తె" మియ్యది యనె - సన్యాసివాడు.
అపుడు నా మనసున - నావిరి పుట్టె
కపురమ్ము వలె లిబ్బి - కఱగియే పోయె.

పేదవానికి గల - పెద్ద గుణాలు
ఏదారి గనబడ - వెవ్వారికైన
అన్ని భూతమ్ములు - నట్టులే యున్న
క్రన్నన రవిలేక - కనబడు నెట్లు ?
తలపులు పేదల - తలలోన పుట్టి
తలలోననే అంత-ముల నందు చుండు.
అని తలపోయుచు - నా లిబ్బి జూచి
చనలేని తావున - పని యేటికనుచు
బిలమును చేరి నే - విలపించు చుంటి
కల బలమెల్ల శ-త్రుల జేరిపోయె.
ధనమున్న నే గాని - మనలే నటంచు
మనసున తలపోసి - మఱియొకసారి
చరచర పోయి ఆ-సన్యాసి దఱిసి
అర కన్నుగానున్న - అద నను కొంటి
అతని తలక్రింద - నా ధన పేటి
యే తలగడయగు - టేర్పడ జూచి
మెలమెల్ల పెట్టెను - తొలవంగ దలచి
పలు కోఱలకు కొంత - పని పెట్టికొంటి.

విద్వాన్ విశ్వం





మానితమ్ముగ వింతు - మఱిమఱి వినుడు.

వర్తక కుమారుని కథ :

పురమొక్కటందు కా-పురముండు నొక్క
వర వర్తకుండు సా-గరదత్తు డనగ.
అతని పుత్రుడు వీథి - నరుగుచు నొకట
శత రూప్యములకు పు-స్తక మొండు గొనియె
అందులో నొక శ్లోక - మగుపడె నంతె
పొందుగా మఱియొక్క - పొలకువే లేదు.
"ప్రాప్తమున్న ధనమ్ము - బడయు మానవుడు.
ప్రాప్తమ్ము దొలగింప - బ్రహ్మకుగాదు.
నాదికా, దందుకే - నాదికాలేదు.
ఏ దెవ్వరిదొ వారి-కే యది దొరకు."
అది శ్లోకభావ మ-య్యది యయ్యు చూచి
"ఇది నూరు రూప్యమ్ము - లెట్లగు, జడుడ ?
ఇటులైన ధనము నా-ర్జించెద వెట్లు ?
చిటి పాపడవ ? ఇట్టి - సేతలు తగునె"
అని తిట్టి వర్తకుం - డా కుమారకుని
పెనగొను కోపాన - చనుమని యడచె.
పాపమా కొడుకు దై-వము దిట్టు కొనుచు
దాపుల నిల్వక - దడదడ పోయి
దేశాంతరమ్ముల - దిరుగుచు నొక్క
దేశ పట్టణమున - దిగులుతో నిలిచె.
" ఎవరయ్య నీవెవ్వ - రేయూరు మీది ?
వివరింపు మిచ్చట - విడిసితి వేల ?"
అని యెవ్వరడిగిన - నా కుమారకుడు
" తనకేది ప్రాప్తమో - తప్పక వచ్చు "
అని యొక్కటే మాట - అందఱితోడ

పుటుకు పుటుక్కను - పోవడి విన్న
కటు తపస్వి యతండు - కఱ్ఱతో కొట్టె
గిరగిర తిరగి నే - కీడ్పాటు జెంది
సరగున నెట్టులో - సాగి పోయితిని.
నేలపై నూకలు - నిండుకో లేదు
చాలింప లేదింక - సజ్జీవ యాత్ర.
ఇంతకు నా లబ్ధి - యెవరిదో ఏమొ
సొంతమే యైనచో - జోగునా అట్లు.
మనసొత్తు దక్కును - మనకు ; కాకున్న
మనకది కాదని మానుకో వలయు.

కాకి, తాబేలు :

అది యెట్లు మిత్రమా - అది యెట్టులగును
ఎది ఏరిదొ వారి-కే యబ్బు నెట్లు ?

హిరణ్యకం (ఎలుక) :

ఔనిది యెఱిగింప - నేనొక్క కథను





ననుకొంచు నచటనే - అధి వసియించె.
ఆ పుర రాజేంద్రు - ననుగు కుమారి
రూప యౌవన గుణా-రూఢ చంద్రవతి
ఒక ఉత్సవమ్మున - నూరెల్ల జూచు
టకు బయల్దేరెను - సకియలతోడ
తిరుగుచు నొకచోట - తరుణు, రూపసిని
వరకుమారుని జూచి - వలచె నా కన్నె.
చెలి బిల్చి వానిని - చేత జూపించి
వలచితి కొనిరమ్ము - వాని నంచడిగె.
సకి వాని చెంతకు - చయ్యన సరిగి
సకలమ్ము జెప్పి ఆ-జ్ఞా పింపుడనియె.
" వలచెను కన్నియ - వరుడవు నీవు;
చెలి నీవు రాకున్న - బలియగు " ననియె.
" సరివత్తు గాని మీ-సఖి యుండు నంతి
పురమందు నే నెట్లు - తరలి రాగలను "
అని యువకుండన్న - " నందులకేమి?
ముని మాపుకాగనే - మోకు దించెదను
దానిని బట్టుక - తరుణి సౌధమ్ము
లోనికి రావలె - నేనుందు నచట "
అని చెలికత్తె చె-ప్పిన రాచకొడుకు
తను వత్తునని దాని - ననిపె ఊకొట్టి.
రాత్రైనది గాని - రాజపుత్రకుడు
గోతిలో పడుటకు - కోరుకో లేదు.
వడి రాజసౌధమ్ము-వంకకే చనక
గడపదాటక వాడు - గడపె నారాత్రి.
మఱి మన వర్తక-మాన్యసుతుండు
తిరుగుచు రాచకూ-తురి మిద్దెనుండి
వ్రేలాడుచున్న - మోకును గాంచి
ప్రేమకు వేలుట చూచి - మొనసి పై కెక్కె
ఏ కారణమ్ము యో-చించగా లేక.
చెలికత్తె తోడ్కొని - సేవలు చేసి
లలన వద్దకు చేర్చె - కల దెఱుంగకయ.
నిజముగా తనుగోరు - నీటుకా డనుచు
గుజగుజ వోయెడు - గుండెలతోడ
రాజపుత్రిక వాని - రతనాల శయ్య
పైజేర్చి తనియించి - పలుకగ సాగె.
" మీకోసమై నేను - మిగుల నాశించి
శోకమ్ము పాలైతి - రాకుమారుండ
నిను దప్ప నింకొక్క - జను పెండ్లియాడ
నను ప్రియమ్ములదన్ను - నను పల్కరింపు"
అన్నంత వాడేమొ - అలవాటుకొలది
అన్నాడు: " ప్రాప్తమె-య్యది అదే వచ్చు"



# తిట్లూ-శాపనార్థాలూ

ఒక గ్రామంలో ఒక వడ్డీవ్యాపారి ఉండేవాడు. వాడు పరమపాపిష్టివాడు. అందుచేత వాడికి దేవతలు కనిపించకపోయినా పిశాచాలు తప్పక కనిపిస్తూండేవి.

పిశాచాలను చూస్తే మంచివాళ్లు దడుచుకుంటారు, కాని పాపిష్టివాళ్లకు పిశాచాల భయం ఉండదు.

ఈ వడ్డీవ్యాపారి ఆ గ్రామంలో ఉన్న ఒక పేదరాలికి అప్పు ఇచ్చాడు. ఆ పేదరాలు అరుగురు పిల్లల తల్లి. అకస్మాత్తుగా భర్త పోయాడు. పిల్లలకు ఇంత గంజికూడా కాచిపోయలేని స్థితిలో అవిడ రెండేళ్లక్రితం వడ్డీవ్యాపారిదగ్గిర ముప్ఫై రూపాయలు అప్పు చేసి తన ఇల్లు తాకట్టుపెట్టింది. మరుసటి ఏడు ఆమె పాతబాకీ చెల్లు వేయలేకపోగా మరొక పదిహేను రూపాయలు అప్పు చేసింది. వడ్డీవ్యాపారి ఆ బాకీలకు వడ్డీ కట్టి, వడ్డీలకు మళ్లీ వడ్డీలు కట్టి, అంతా కలిసి నూరు రూపాయలకు లెక్కతేల్చాడు. పేదరాలుండే ఇల్లు నూరు రూపాయలకన్న ఎక్కువ ఖరీదే ఉంటుంది. అయినా ఆ ఇల్లు ఖాళీచేయించి స్వాధీనం చేసుకుందామని వడ్డీవ్యాపారికి దుర్బుద్ధి పుట్టి ఒకనాటి ఉదయం వీధిలోకి అడుగుపెట్టాడు.

సరిగా ఆ సమయానికే ఒక పిశాచం తన ఇంటిముందుగా పోతూ వడ్డీ వ్యాపారికి కనబడింది.

"ఏమిటి గిరాకీ? ఇవాళ మా ఊళ్ళో ఎవరికన్నా మూడిందా ఏం?" అన్నాడు వడ్డీవ్యాపారి పిశాచంతో.

పిశాచం నవ్వి, "మీ ఊరు వచ్చి చాలా కాలమయింది. ఏమన్నా ఆహారం దొరుకుతుందేమోనని బయలుదేరి వచ్చాను. నువు ఎంతదాకా?" అని అడిగింది.

పేదరాలి ఇల్లు స్వాధీనం చేసుకోబోతున్నానని వడ్డీవ్యాపారి, తానుపెట్టిన అప్పు

పి. సుశీలాదేవి

గురించీ, దానిమీద పెరిగిన వడ్డీగురించీ పిశాచానికి చెప్పాడు.

"అబ్బా, రెండేళ్ళు తిరగకుండానే అసలుకన్న వడ్డీ ఎక్కువయిందే! మీ మనుషులు మమ్మల్ని ఆడిపోసుకుంటారు గాని, మీలో మమ్మల్ని మించినవాళ్లున్నారు!" అన్నది పిశాచం.

వడ్డీవ్యాపారి ఈ మాటలు విని ఆగ్రహించకపోగా, చాలా గర్వించాడు. ధనం పిండటంలో తానెంత సమర్థుడైనదీ అయనకు తెలుసు.

వారు మాట్లాడుకుంటూ కొంతదూరం వెళ్లేసరికి ఒక పూరిగుడిసెలోంచి ఎవరో స్త్రీ తన కొడుకుమీద కోప్పడటం వినిపించింది. "నిన్ను పిశాచం మింగా! తలుపు జాగ్రత్తగా మూయమని ఎన్నిసార్లు చెప్పినా నీకు జ్ఞాపకం ఉండదేం! మాయదారిపిల్లి కాస్తా వెన్నంతా మింగిపోయింది!" అంటున్నది.

"అదుగో నీకు అహారం! ఆవిడ తన కొడుకును నీకు మింగబెడుతుందిట!" అన్నాడు వడ్డీవ్యాపారి పిశాచంతో.

పిశాచం నవ్వి, "అది మాటవరసకు అన్నమాటే గాని, ఆవిడ మనస్ఫూర్తిగా తన కొడుకును నాకిస్తాననటం లేదు. ఇంత అనుభవం వున్నవాణ్ణి నాకాపాటి తెలియదా?" అన్నది.



మరి కొంతదూరం వెళ్లాక ఒకచోట భార్యాభర్తలు ఒకరినొకరు తిట్టుకుంటున్నారు. ఒకరినొకరు "నిన్ను పిశాచం మింగా!" అని తిట్టుకోపటం విని, వడ్డీవ్యాపారి పిశాచంకేసి తిరిగి, "ఇది ఇంకా మంచి అవకాశం! ఒక్కదెబ్బతో ఇద్దరిని మింగవచ్చు!" అన్నాడు నవ్వుతూ.

పిశాచం తల అడ్డంగా తిప్పి, "అవి తిట్లే గాని నిజమైన శాపనార్థాలు గావు. మన దారిన మనం పోదాం పద!" అన్నది.

వారు మరి కొంతదూరం నడిచి పేదరాలి ఇల్లు చేరుకున్నారు. వడ్డీవ్యాపారి ఇంటి తలుపు తట్టాడు. పేదరాలు వచ్చి తలుపు తీసి, వడ్డీవ్యాపారిని చూసి "ఏం నాయనా?" అని పలకరించింది.

"మరేం లేదు, పిన్నీ, నీ బాకీ అసలు ఫాయిదాలు చేరి గొలుసువడ్డీ లెక్కన నూరు రూపాయలయింది. ఈ ఇల్లేమో నాకు తాకట్టు పెడితివి. ఈ రెండేళ్లలోనూ ఒక్క దమ్మిడీ చెల్లువెయ్యకపోతివి. నువుమాత్రం ఎక్కణ్ణుంచి తెస్తావులే! ఇంటి ధరకూ బాకీకి సరిపోతుంది. అందుచేత నువు ఇవాళే ఇల్లు ఖాళీచేసి నాకు స్వాధీనం చేసి బాకీ చెల్లు వేసుకో. ఈ మాట చెప్పి పోదామని వచ్చాను," అన్నాడు వడ్డీవ్యాపారి.

పేదరాలికి మండిపోయింది. "నీకడుపు కాలా! నిన్ను పిచాచం మింగా! సలభై అయిదు రూపాయలు చేతిలో పెట్టి ఇల్లు కాజేస్తావట్రా? ఉండు నీసంగతి చెబుతా," అంటూ లోపలికి వెళ్ళింది.

అవిడ వెనక్కు తిరిగిన మరుక్షణం పిశాచం వడ్డీవ్యాపారిని గుటుక్కున మింగి తన దారిన తాను వెళ్ళిపోయింది. పేదరాలు వడ్డీవ్యాపారికి దేహశుద్ధి చెయ్యటానికని చీపురుకట్ట తీసుకువచ్చేసరికి బయట ఎవరూ లేరు. వీధివీధంతా నిర్మానుష్యంగా ఉంది. "ఇంతలోనే ఏమైపోయాడబ్బా?" అనుకుంటూ పేదరాలు తలుపు వేసుకున్నది.






## 8

[రూపధరుడి అనుచరులు తాము చేసిన ప్రమాణాన్ని నిలబెట్టుకోలేదు. రూపధరుడు దూరాన ఉన్న సమయంలో, మాయావి ప్రేరేపించగా వారు సూర్యభగవానుడి పశువులను చంపి వంట చేసుకు తిన్నారు. దాని ఫలితం త్వరలోనే కనబడింది. నడిసముద్రంలో రూపధరుడి పడవ మునిగిపోయింది. అందరూ సముద్రానికి ఎర అయారు. ఒక్క రూపధరుడుమాత్రం ఒక తీరాన వచ్చి పడ్డాడు.]

ఆ దేశాన్ని ఏలే రాజుపేరు మహామేధి. ఆయనకు వారుణి అనే కుమార్తె ఉన్నది. తెల్లవారుజామున ఆమెకొక వింతకల వచ్చింది. ఆ కలలో ఆమె స్నేహితురాలొకతె కనిపించి, " ఏమే, వారుణీ? నీకింత సోమరితనమేమిటే? బోలెడన్ని మాసిన బట్టలు ఉతకవలసి ఉందిగదా? రేపు పెళ్లికి మాసిన బట్టలు కట్టుకుంటావా? అంతా చూసి ఏమనుకుంటారు? తెల్లవారుతూనే బట్టలు ఉతకపోదాం పద. నేను కూడా నీ వెంట సాయం వస్తాను. బండి ఒకటి సిద్ధం చేయించమని మీ నాన్నతో చెప్పు. అంతదూరం వున్న చాకి రేవుదాకా నడవటం చాలా కష్టం," అన్నది.

వారుణి వెంటనే నిద్రమేలుకుని తూర్పు తెల్లవారుతూ ఉండటం గమనించింది. ఆమె కలలో చెప్పినట్టు చేయ నిశ్చయించుకుని తల్లివద్దకు వెళ్లి బట్టలు ఉతకబోతానని

గ్రీకు పురాణగాథ






చెప్పింది. తరవాత తండ్రివద్దకు వెళ్లింది. ఆయన అప్పుడే నాయకుల సమావేశానికి పోబోతున్నాడు.

"నాన్నా, నాకొక పెద్దబండీ కావాలి. నేను నదికి వెళ్లి ఈ పూట మనకున్న మంచిబట్ట లన్నీ ఉతుకుతాను. ఎంతోకాలంగా మైల బట్టలు చాలా పేరుకుని ఉన్నాయి. చూడబోతే ఇంటినిండా జనం ఉన్నారు. అందరూ ఎప్పటికప్పుడు చలవబట్టలు తెమ్మంటారు," అన్నదామె తండ్రితో.

మహామేధి, "దానికేం భాగ్యమమ్మా? పనివాళ్ళతో చెప్పి నీకు కావలసినంత పెద్ద బండి కట్టించుకో," అన్నాడు.

వెంటనే కంచరగాడిదలతోసహా బండీ తయారయింది. వారుణికీ దాసీలకూ సరి పడా భోజనపదార్థాలు తీసుకున్నారు. వారుణి బండీ ఎక్కి కొరడా తీసుకుని కంచరగాడిదలను అదిలిస్తూ బండి తోల సాగింది. చాలామంది దాసీలు కబుర్లాడుతూ బండివెనకే నడవసాగారు.

కొంతసేపటికి వారు నదివద్ద చాకిరేవు చేరుకున్నారు. కంచరగాడిదలను విప్పి నదిఒడ్డున మేతకు వదిలారు. తరవాత వారు మైలబట్టలను పోటీలుపడి ఉతకసాగారు. చాకిపని ముగియగానే వారందరూ సముద్ర తీరానికి వెళ్లి అక్కడ స్నానాలు చేసి, నది ఒడ్డుకు తిరిగి వచ్చి బట్టలన్నీ అరవేసి భోజనాలు చేశారు.

తరవాత వాళ్లు పాటలు పాడుతూ బంతి ఆట ఆడసాగారు. ఆటలో బంతి ప్రమాద వశాన నీటిలో పడిపోయింది. అదిచూసి అందరూ ఒక్కసారిగా కేకలు పెట్టారు.

ఈ కేకలకు రూపధరుడు నిద్ర మేలు కున్నాడు. అతను పొదలలోనుంచి బయ టికి వచ్చి వారుణినీ ఆమె దాసీలనూ చూశాడు. మట్టికొట్టుకుని ఉన్న అతని ఆకారాన్ని చూసి వారుణి దాసీలందరూ బెదిరి పారిపోయి చెట్లవెనకా పుట్టలవెనకా





దాగారు. వారుణి మాత్రం నిర్భయంగా వున్నచోటనే నిలబడింది.

రూపధరుడు అంతదూరాన ఆగి విన యంగా, " సుందరీ, నీవు మనిషివో, దేవతవో, నాకు తెలియదు. నీ ఎత్తూ, అందమూ చూస్తే దేవతలాగున్నావు. ఒకవేళ నీవు మనిషివే అయితే నిన్నుకన్న తల్లిదండ్రుల మహాభాగ్యం ఏమని చెప్పాలి ! నీ తోబుట్టువు లెంత అదృష్టవంతులు ! నిన్ను చేపట్ట బోయేవాడు ఇంకా ఎంత అదృష్టవంతుడు ! నేను అనేక దేశాలు తిరిగాను గాని నీవంటి అందగత్తెను ఎక్కడా చూడలేదు. ఇప్పుడు నేను చాలా దీనస్థితిలో ఉన్నాను. ఇరవై రోజులు సముద్రంమీద పడరానిపాట్లు పడి నిన్ననే ఈ తీరాన వచ్చిపడ్డాను. నాకీ దేశం కొత్త. నన్ను కాపాడితే నువే కాపాడాలి. నన్నూ నాస్థితినీ చూసి కనికరించి నాకు కట్టుకునేటందుకు తగిన వస్త్రం ఒకటి ఇప్పించు, మీ ఊరికి దారి చెప్పు. కరు ణించి ఈ సహాయం చేస్తివా నీ పుణ్యం ఊరికేపోదు !" అన్నాడు.

" అయ్యా, నీవు తెలివిగల వాడివిలాగే కనిపిస్తున్నావు. సుఖమన్నది దేవతలు ప్రసా దించ వలసిందే. కాని నీ విప్పుడు మా దేశంలో ఉన్నావు గనక నీకు అన్నవస్త్రాలకు




లోటుండదని నేను హామీ ఇస్తున్నాను. మా ఊరికి దారికూడా చెబుతాను. ఇది ఫైయా సియా దేశం, మహామేధి ఈ దేశానికి రాజు. నేనాయన కుమార్తెను," అన్నది వారుణి.

తరవాత ఆమె తన దాసీలను పిలిచి, " ఎందుకలా బెదురుగొడ్లలాగా పారి పోతారు. ఈయన మిమ్మల్ని తినేస్తాడా ? పాపం, ఈయన ఇల్లూ వాకిలీ లేనివాడు. ఈయనకు తినటానికేమైనా ఇవ్వండి, నదిలో స్నానం చేయించండి," అన్నది.

దాసీలు రూపధరుడికి స్నానాల రేవు చూపించి, స్నానం అనంతరం వంటికి మర్దనచేసుకునే తెలమూ, కటుకోవటానికి



బట్టలూ ఇచ్చారు. రూపధరుడు నదిలో దిగి తన శరీరంమీద పేరుకునిఉన్న ఉప్పూ, మట్టీ కడుక్కుని, శరీరమంతా నూనె మర్దనచేసుకుని, రాజకుమార్తె ఇప్పించిన బట్టలు కట్టుకుని, పులికాపు చేసిన విగ్రహం లాగా నిగనిగలాడుతూ ఇవతలికి వచ్చాడు. అతన్ని మొట్టమొదట చూసి వికారంగా ఉన్నాడనుకున్న వారుణి ఇప్పుడతన్ని చూసి స్వర్గంలో వుండే దేవతలాగా ఉన్నా డనుకున్నది. తనకు అటువంటి భర్త దొరి కితే బాగుండునని ఆమెకు అనిపించింది. అతను శాశ్వతంగా తమ దేశంలోనే ఉండి పోవాలని ఆమె కోరుకున్నది.



తరవాత దాసీలు రూపధరుడికి భోజనం పెట్టారు. అతను భోజనం చేసి అప్పటికి చాలా రోజులయింది.

ఈలోపుగా జరగవలిసినదాన్ని గురించి వారుణి దీర్ఘంగా ఆలోచించింది. ఆమె యుక్తవయసురాలు, పెళ్లి కానిది. ఆ దేశంలో అనేకమంది యువకులు ఆమెను పెళ్లాడ టానికి సిద్ధంగా ఉన్నారు; వారినందరినీ ఆమె అదివరకే నిరాకరించింది. అటువంటి పరిస్థితిలో ఆమె రూపధరుణ్ణి తనవెంట నగరానికి తీసుకుపోవటం భావ్యంగా ఉండదు. ఎవడినో ఊరూ పేరు లేనివాణ్ణి భర్తగా సంపాదించి వెంట తెచ్చుకున్నదని అందరూ ఆడిపోస్తారు.

అందుచేత ఈ కొత్తవ్యక్తి తన అతిథిగా రావటంకంటె, అతనంతట అతనే తన ఇంటికి వచ్చి ఆతిథ్యంకోరటం అన్నివిధాలా మంచిదని వారుణి నిశ్చయించింది.

దాసీలు ఆరిన బట్టలను పోగువేస్తుండగా ఆమె రూపధరుడితో ఇలా అన్నది: "మనం ఇక బయలుదేరి పోదాం. నీవు మిగిలిన వారితోబాటు నా బండి వెనకనే నడిచిరా. ఈ విధంగా కోటగోడలదాకా రావచ్చు. కాని నాతోబాటు నగరంలో ప్రవేశించవద్దు. నలుగురూ నోటికి వచ్చినట్టు మాట్లాడతారు.

నగరం వెలపల ఒక తోట వున్నది. అందులో విశ్రాంతి తీసుకో. నేను ఇల్లు చేరటానికి కొంత వ్యవధి ఇచ్చి, అప్పుడు బయలుదేరి నేరుగా మా ఇంటికి వచ్చెయ్యి. మా ఇల్లు కనుక్కోవటం ఏమీ కష్టంకాదు, పని పిల్లలను అడిగినా చెబుతారు. మా ఇల్లు చేరుకున్నాక ఎక్కడా ఆగకుండా నేరుగా లోపలికి రా. అక్కడ నీకు మా నాన్నా, అమ్మా కనిపిస్తారు. నీవు సంకోచించకుండా మా అమ్మను సమీపించి, ఉపాయంగా ఆవిడతో ప్రసంగించి అతిథ్యం కోరు. నీ ధోరణి ఆవిడకు నచ్చిందంటే నీ పని సాను కూలమైనట్టే. మా రాజభవనంలో ఆవిడ మాటకు ఏనాడూ తిరుగులేదు. నీ అదృష్టం బావుండి ఆవిడ అనుగ్రహిస్తే నీకు ఎంత సహాయమైనా లభిస్తుంది."

తరవాత వారుణి బండీ ఎక్కి కంచర గాడిదెలను అదిలించింది. అందరూ బయలుదేరారు. వారు తోటను చేరగానే రూపధరుడు అక్కడ దిగబడిపోయాడు. మిగిలినవారు ముందుకు సాగారు. అప్పటికి సూర్యాస్తమానమయింది. రూపధరుడు తన ఇష్టదేవత అయిన బుద్ధిమతిని చాలాసేపు ధ్యానించి తానుకూడా రాజభవనానికి బయలుదేరాడు.

ఈ లోపుగా రాజకుమార్తె వారుణి ఇల్లు చేరుకున్నది. ఆమె అన్నలు అయిదుగురూ వచ్చి ఉతికిన బట్టలను లోపలికి తీసుకు పోయారు. అప్పుడే పాయిలు రాజేసి వంట ప్రారంభించినట్టు వారుణి తెలుసుకున్నది.

రూపధరుడు నగరంలో ప్రవేశించాడు. కాని చీకటిలో అతన్ని ఎవరూ గమనించ లేదు, పలకరించలేదు. అతనికి ఒక చిన్న పిల్ల నీటికుండతోసహా ఎదురయింది. రూపధరుడు ఆమెను పలకరించి, " చూడమ్మా, నేను పరదేశిని. నాకు మహామేధి మహా రాజుగారి ఇంటికి దారి చూపగలవా?" అని అడిగాడు.






"నేను చూపిస్తాను రా, బాబయ్యా. నువ్విలా ఇక్కడివాళ్ళను పలకరించ గూడదు, తెలుసా. పరదేశీలంటే ఇక్కడి వాళ్ళకు చాలా అనుమానం. అందుచేత మాట్లాడకుండా, ఎవరికేసీ చూడకుండా, నా వెనకనే రా !" అన్నదా పిల్ల.

ఆమె వెంట రూపధరుడు రాజభవనం చేరాడు. ఆ భవనం దేదీప్యమానంగా ఉన్నది. రూపధరుడు లోపల ప్రవేశించ టానికి జంకాడు. అతను చాలాసేపు అక్కడే నిలబడి అక్కడ ఉన్న దివిటీల వెలుగులో పనులు చేస్తున్న బానిసలనూ, నాలుగెకరాల పళ్ళ తోటనూ చూశాడు. చివర కతను సాహసించి లోపల ప్రవే శించాడు. వారుణి చెప్పిన ప్రకారమే అతను నేరుగా లోపలికి వెళ్ళాడు.

లోపల ఒక విశాలమైన చావడిలో నగ రపు పెద్దలందరూ భోజనాలకు కూచుని ఉన్నారు. రూపధరుడు చావడికుండా నడిచి వెళ్ళగా లోపల అతనికి రాజూ, రాణీ కని పించారు. రూపధరుడు నేరుగా రాణిముందు మోకరించి, "మహారాణీ, నేనొక నిర్భా గ్యుణ్ణి! శరణార్థిగా మీ వద్దకు వచ్చాను. మీరూ మీ పరివారమూ పుత్రపౌత్రాభి వృద్ధిగా వర్ధిల్లాలి! నేను స్వదేశానికి తిరిగి వెళ్ళిపోవటానికి మీరు నాకు సహాయం చెయ్యాలి," అన్నాడు.

అతను ఇలా చెబుతుంటే అక్కడ ఉన్న వారందరూ నిర్ఘాంతపోయి చూశారు. చివర కొక వృద్ధుడు మహామేధితో, "రాజా, మన అతిథి నేలమీద కూర్చునివుండటం మన మర్యాదకు లోపం. అందుచేత నీవు స్వయంగా ఈ పెద్దమనిషిని ఒక ఆసనంపై కూచోబెట్టి మనతోబాటు భోజనానికి ఆహ్వానించు," అన్నాడు.

మహామేధి లేచి రూపధరుడికి చెయ్యి యిచ్చి తీసుకుని వచ్చి తన పక్కనే, తన పెద్ద కుమారుడు కూచుని ఉన్న ఆసనం



మీద కూచోబెట్టాడు. రూపధరుడికోసం ఆ యువకుడు తన ఆసనాన్ని ఖాళీచేసి వేరే ఇంకొక చోట కూచున్నాడు. తరవాత అందరూ కలిసి భోజనాలు చేశారు.

భోజనాలు అయాక మహామేధి మహా రాజు లేచి నిలబడి పెద్దలతో ఇలా అన్నాడు:

"మీరంతా భోజనాలు చేశారు. ఈ పూటకు ఎవరిమానాన వారు విశ్రాంతి తీసుకుని నిద్రపొండి. రేపు ఉదయం పెంద లాడే మనమంతా సమావేశమై మన అతి థికి వినోదాలు చేకూర్చి తరువాత ఆయన ప్రయాణం సంగతి చూదాం. ఆయన స్వదేశం ఎంతదూరాన ఉన్నా సరే అక్కడి కాయన సుఖంగా, క్షేమంగా చేరే ఏర్పాట్లు చేయటం మన విధి. మనం మంచి ఏర్పాట్లు చేసినప్పటికీ ఆయన కష్టాలు పడాలని రాసి పెట్టి ఉంటే తప్పేది లేదు. ఒకవేళ ఈయన మానవరూపంలో అవతరించిన దేవతే అయినాకూడా అది మనకు కొత్త సంగతి కాదు. దేవతలు అప్పుడప్పుడూ నర రూపంలో మనని చూడవచ్చి మనతో పాటు విందు వినోదాలలో పాల్గొనటం అనా దిగా వస్తున్నదే!"

ఈ మాటలు వినగానే రూపధరుడు, "మహారాజా, మీరలాటి అపోహ పడకండి.



నేను దేవతను కాను, మానవుణ్ణే, అందు లోనూ అష్టకష్టాలకు గురిఅయిన మాన వుణ్ణి. బహుశా నేను భరించిన బాధలు ఇంకొకరెవరూ భరించి ఉండరు. అందుచేత యింతటితోనైనా నా కష్టాలను గట్టెక్కించ టానికి తమరు సాయపడండి. నాకు మిగిలి ఉన్న కోరిక ఏమంటే నా దేశాన్నీ, నా వారినీ ఒక్కసారి కళ్ళచూసి మరణించా లని!" అన్నాడు.

ఈ మాటలు విని అందరూ రూపధరుడి పైన సానుభూతి ప్రకటించారు. అందరూ అక్కడినుంచి వెళ్ళాక రూపధరుడూ, రాజూ, రాణీ మాత్రం మిగిలారు.





రాణీ రూపధరుడికేసి తిరిగి అతను ధరించిన దుస్తులు తాను కుట్టినవేనని గుర్తించి, "నాయనా, నిన్ను మొట్టమొదటి ప్రశ్న నేనే అడుగుతాను. నువ్వెవరు? ఎక్కడినుంచి వస్తున్నావు? నీకీదుస్తులు ఎవరిచ్చారు? నువు సముద్రంమీద కొట్టుకు వచ్చానని చెప్పావు కాదూ?" అన్నది.

తాను సమ్మోహిని చెరనుండి బయట పడినది లగాయతు ఈ దేశపు తీరాన వచ్చి పడేవరకూ జరిగిన కథ యావత్తూ రూప ధరుడు వివరించి చెప్పాడు. తరవాత వారుణి రావటమూ, తను ఆమెకు తన దీనావస్థగురించి చెప్పుకోవటమూ, ఆమె తనకు తిండీ బట్టా ఇవ్వటమూకూడా దాచ కుండా అతను వారితో చెప్పేశాడు.

అంతా విని మహామేధి, "అయ్యా, నా కూతురు చాలా పొరపాటు చేసింది. ఆమె మిమ్మల్ని తనవెంట తీసుకుని వచ్చి ఉండ వలిసింది!" అన్నాడు.

"మహారాజా, ఆమెను నిందించకండి. ఆమె నన్ను తనవెంట రమ్మనే అన్నది. కాని మనుషులకు వెరిచి నేనే జంకాను,' అన్నాడు రూపధరుడు.

"మీరు మా అమ్మాయిని పెళ్ళాడి ఇక్కడే ఉండిపోతానన్నా నేను అభ్యంతరం చెప్పి ఉండను. మీరు సంకోచించి ఉండ వలిసిన అవసరం లేదు. ఈ రాత్రికి నిద్ర పొండి. రేపు మీ ప్రయాణం ఏర్పాట్లన్నీ చేసి మీరు క్షేమంగా స్వదేశం పోయేలాగు చూస్తాను. నా ఓడలను మించిన ఓడలు గాని, మా నావికులను మించిన నావికులు గాని మీకు ప్రపంచంలో ఎక్కడా దొర కరు," అన్నాడు రాజు.

వారీవిధంగా మాట్లాడుకుంటూ ఉన్న సమయంలో రాణి రూపధరుడికి పక్క వేయించింది. రూపధరుడు తాను పడిన కష్టాలన్నీ మరిచి ఆ పక్కమీద పడుకుని సుఖంగా నిద్రపోయాడు. —(ఇంకా వుంది)





# అన్నదమ్ములు

ఒక గ్రామంలో ఒక పేదవాడుండేవాడు. అతనికి పిల్లలు లేరు. అతనికి ఉన్న ఆస్తి అంతా కలిసి ఒక ఇల్లూ, ఒక ఆడగుర్రమూ, ఒక ఆడకుక్కా మాత్రమే.

ప్రతిరోజూ తెల్లవారుతూనే పేదవాడు తన గుర్రాన్ని తీసుకుని దూరంగావున్న అడవికి పోయి, కట్టెలు కొట్టి సాయంత్రాని కల్లా తిరిగి ఇల్లు చేరుకునేవాడు.

ఒకనాడతను అడవినుంచి కట్టెలతో తిరిగి వస్తుండగా ఒకచోట ఒక చిన్న మామిడి చెట్టు కనిపించింది. దానిమీద రెండే పళ్లున్నాయి. అతను వాటిని కోసి ఇంటికి తెచ్చాడు. అతని భార్య ఆ పళ్లను పిండి రసం ఒక గిన్నెలో పోసి, తొక్కలను గుర్రానికి పెట్టి, టెంకలను దొడ్లో గిరవాటు వేసింది. మామిడిపండ్ల రసాన్ని భార్యాభర్త లిద్దరూ తాగాక, ఇంటికుక్క వచ్చి గిన్నెను నాకింది.

దీని ఫలితంగా ఆడకుక్క రెండు పిల్లల్ని పెట్టింది. గుర్రం రెండు పిల్లలను ఈనింది, కట్టెలు కొట్టేవాడి భార్యకు ఇద్దరు అందమైన కవలపిల్లలు కలిగారు, దొడ్లో మామిడి టెంకలు పడినచోట రెండు బంగారు కత్తులు మొలిచాయి.

పేదవాడి కుమాళ్లిద్దరూ పెరిగి పెద్దవారయారు. ఒకనాడు పెద్దకుమారుడు తండ్రితో, "నాన్నా, మనం కష్టాలు తప్ప సుఖాలన్నవి ఎరగం. అందుచేత నేను దేశాలు తిరిగి ధనం సంపాదించుకు తిరిగి వస్తాను," అన్నాడు.

తమకు రెండు కళ్లూలాగున్న కొడుకు లిద్దరిలో ఒకడు దూరం కావటం తల్లిదండ్రులకు ఏమాత్రమూ ఇష్టంలేదు. కాని వాళ్లుకూడా కట్టెలుకొట్టి జీవించవలిసి వస్తుందని వారు చాలా విచారించారు. అదీగాక పిల్లలిద్దరూ అచ్చగా ఒకటిగానే

టి. మోహనరావు





నిర్మలంగా ఉన్నదో చూడు. ఇది ఏనాడు మకిలబారుతుందో అనాడు నాకు అపద జరిగిందని తెలుసుకో. వీలయితే నువు వచ్చి నన్ను రకించు. నాకు అపాయం జరిగిందని అమ్మతోనూ, నాన్నతోనూ మాత్రం చెప్పకు. తెలిసిందా," అన్నాడు.

తమ్ముడు అ గాజుకుప్పె తీసుకుని ఇంటికి తిరిగి వెళ్లాడు. పెద్దవాడు ప్రయాణం సాగించి కొంతకాలానికి ఒక నగరం చేరుకున్నాడు. అతను రాజభవనం ముందుగా వెళుతూండగా, మేడపైనుంచి రాజకుమార్తె అతన్ని చూసి మోహించింది.

అమె వెంటనే తన తండ్రి దగ్గిరికి పరిగెత్తుకుపోయి, ఆ దారే వెళ్లే యువకుడికి అతిథ్యం ఇవ్వమని అడిగింది.

ఒక్కతే కూతురు కావటంవల్ల రాజుగారామెమాట ఎన్నడూ తీసివేసేవాడు కాడు. అయన తన భటులను పంపి కట్టెలుకొట్టే వాడి కొడుకును పిలిపించాడు. చేతిలో బంగారు కత్తి ధరించి సూర్యుడల్లే వెలిగిపోతున్న అ యువకుణ్ణి చూడగానే రాజకుటుంబం వారికందరికీ ఎంతో ముచ్చట అయింది. తన కుమార్తె అతన్ని ప్రేమించిందని తెలుసుకుని రాజుగారు మంచి ముహూర్తాన వారిద్దరికి పెళ్లిచేసేశాడు. పెద్ద

ఉంటారు; అందుచేత ఏ ఒకడు ఎదట తిరుగుతున్నా ఇద్దరినీ చూసినట్టే ఉంటుంది. అందుచేత తమ పెద్దకొడకు దేశాటన చేయటానికి వారు అనుమతించారు.

పెద్దవాడు బంగారు కత్తులలో ఒకటి తీసుకుని, ఒక గుర్రం ఎక్కి, ఒక కుక్కను వెంటబెట్టుకుని బయలుదేరాడు. తల్లిదండ్రులు వాడికి ఎన్నో జాగ్రతలు చెప్పారు. రెండోవాడు పొలిమేరదాకా తన అన్నను సాగనంపాడు.

వాడు వెనక్కుతిరిగి వచ్చేటప్పుడు పెద్దవాడు వాడికి ఒక గాజుకుప్పె ఇచ్చి, "తమ్ముడూ, ఇందులో ఉన్న నీరు ఎంత



ఎత్తున ఉత్సవాలూ, ఊరేగింపులూ, విందులూ, వినోదాలూ జరిగాయి.

ఒకరోజు రాత్రి భోజనాలయాక రాజు గారి అల్లుడూ కూతురూ చల్లగాలి కోసం మేడమీదికి వెళ్లాడు. అతను చుట్టూ కలయ జూస్తూండగా దూరాన ఒక కొండ అతి విచిత్రంగా తగలబడి పోతూండటం కని పించింది. చూస్తూండగానే మంటలు మరీ పెద్దవవుతున్నవి.

అతను తన భార్యకేసి తిరిగి ఆశ్చర్యంతో, "అదేమిటి ? ఆ కొండ అలా తగలబడి పోతున్నది ?" అని అడిగాడు.

"దాన్ని ఇక్కడ అంతా ఉరుములకొండ అని పిలుస్తారు. పగలు ఆ కొండమీద ఉరు ములమోత వినిపిస్తుంది, రాత్రివేళ కొండ అలా తగలబడుతూ కనిపిస్తుంది. ఏమైనా దాని దగ్గిరికి ఎవరూ వెళ్లరు. వెళ్లినవారెవరూ తిరిగి రాలేదు. వాళ్లు శిలలై పోయారని జనం చెప్పుకుంటారు. మీరుమటుకు పొర బాటునకూడా అటుకేసి వెళ్లకండి !" అన్నది రాజుకూతురు.

అతను ఏమీ మాట్లాడలేదు. మర్నాడింకా తెల్లవారక ముందే అతను నిద్రలేచి, కత్తి తీసుకుని, గుర్రమెక్కి, కుక్కను వెంట బెట్టుకుని ఉరుములకొండ దిక్కుగా బయలు




దేరాడు. అతను కొండను చేరేసరికి బాగా తెల్లవారిపోయింది. అతను కొండ ఎక్కు తూండగా దారిలో ఒక చెట్టుకింద రాతిమీద ఒక ముసలిది కూచుని కనిపించింది.

"అవ్వా, ఈ కొండను గురించి చాలా మంది విడ్డూరంగా చెబుతారు. అసలు విశేషమేమిటో నువు చెప్పగలవా ?" అని అతను ముసలిదాన్ని అడిగాడు.

"ఇక్కడే ఉండేదాన్ని, ఎందుకు చెప్ప లేను, నాయనా ? రా, మా యింటికి పోదాం పద. ఈ కొండ సంగతంతా వివరంగా చెబు తాను," అంటూ ముసలిది రాతిమీదినుంచి లేచి దారితీసింది.

దారిలో ఆ ముసలిది మధ్యమధ్య ఆగుతూ ఒకరకం మొక్కల ఆకులు కోసి చేతపట్టుకోవటం చూసి అతను, "ఈ ఆకులతో ఈ ముసలిదానికి ఏంపనో?" అని ఆశ్చర్యపడ్డాడు.

కొద్దిసేపటికల్లా ముసలిది అతన్ని ఒక గుహలోకి తీసుకుపోయింది. అతను గుహలోకి రెండడుగులువేసి ఆగి వింతగా చుట్టూ కలయజూశాడు. చుట్టూ రాతి విగ్రహాలున్నాయి. కాని అవి విగ్రహాలు కావు, మనుషులే. వారి కళ్లు ఇంకా చూస్తూనే ఉన్నాయి. మిగిలిన శరీరాలుమాత్రం శిల అయిపోయాయి.

అతనికి భయం వేసింది. తానుకూడా శిల అయిపోయేలోగా పారిపోదామనుకున్నాడు. కాని కాలు కదలలేదు. అతని శరీరమంతా కరుడు కట్టిపోయినట్టయింది. తాను శిల అయిపోనట్టు అతను తెలుసుకున్నాడు. ముసలిముండ మంత్రగత్తె. అది అందరినీ మోసంచేసినట్టే తననూ మోసం చేసింది. అపాయమని భార్య ముందుగా హెచ్చరించినా ఆమెమాట వినక తాను ఇలా రాయి అయిపోయాడు!

ఇక్కడ పెద్దవాడికి ఈ దుర్గతి కలగగానే అక్కడ చిన్నవాడి వద్ద ఉన్న గాజుకుప్పెలోని నీరు మురికి అయిపోయింది. తన



అన్నకేదో అపాయం జరిగిందని గ్రహించి వాడు తల్లిదండ్రులతో ఒక చిన్న ప్రయాణం చేసి మళ్లీ వస్తానని చెప్పి, రెండో కత్తి తీసుకుని, రెండో గుర్రమెక్కి, రెండో కుక్కను వెంటబెట్టుకుని బయలుదేరాడు.

అతను వెళ్ళివెళ్ళి తన అన్నచేరిన నగరానికే చేరుకున్నాడు. అతను వీధివెంట వస్తూంటే జనం, "అదుగో, రాజుగారి అల్లుడుగారు! మళ్లీ వచ్చేస్తున్నారు!" అని కేకలు పెట్టసాగారు. అదేమనిషి, అదేకత్తి, అదేగుర్రం, అదేకుక్క! అందుచేత నగరంలోని వారందరూ చిన్నవాణ్ణిచూసి పెద్దవాడని భ్రమపడ్డారు.

ఇదంతా గమనించిన రెండోవాడు, తన అన్న ఈ నగరమే చేరి రాజుగారి అల్లుడు కూడా అయాడని గ్రహించాడు.

తన అల్లుడు మాయమైన రోజునుంచీ రాజుగారు తన అల్లుడికోసం వెతికిస్తూనే ఉన్నాడు. అందుచేత రాజభటులు చిన్నవాణ్ణి చుట్టుముట్టి, "మహారాజా, తమకోసం అందరూ బెంగబెట్టుకుని వున్నారు! దయ చెయ్యండి!" అంటూ చిన్నవాణ్ణి రాజభవనానికి తీసుకువెళ్లారు.

"ఇన్నాళ్లు ఏమైపోయావోయ్? మేమంతా నీకేమంగురించి ఎంత భయపడ్డామో తెలుసా?" అన్నాడు రాజుగారు.






"ఒంటరిగా వేటకు వెళ్ళి దారితప్పాను!" అన్నాడు చిన్నవాడు, తాను మరొక మనిషి నని బయటపెట్టకుండా.

ఆ వచ్చినవాడు రాజుగారి అల్లుడేనని రాజుగారి భవనంలో అందరూ నమ్మారు. మొదట రాజకుమార్తెకూడా నమ్మింది. కాని చిన్నవాడు ఆమెకేసి చూసి, "ఓహో, ఈవిడ మా వదినెగారు కాబోలు!" అన్నట్టుగా చూశాడు.

చిన్నవాడు అలా చూడటంతో రాజకుమార్తెకు అనుమానం కలిగింది.

అయినా నిజం తెలుసుకుందామని, ఆ రాత్రి భోజనాలు కాగానే ఆమె అతన్ని మిద్దెమీదికి తీసుకుపోయింది. అతను తన వదినెగారితో తాను ఎవరైనదీ చెప్పేసి, ఈ విషయం రహస్యంగా ఉంచమన్నాడు. ఆమె అనుమానం రుజువయింది.

అతను దూరాన మండుతున్న కొండను చూసి నిర్ఘాంతపోయి, "ఏమిటాకొండ అలా తగలబడిపోతున్నది?" అని అడిగాడు.

రాజకుమార్తె ఉరుములకొండను గురించి అతనితో చెప్పి, "అక్కడికి వెళ్లటం చాలా ప్రమాదకరం. ఆ సంగతి మీ అన్నకు కూడా చెప్పాను!" అన్నది.

తరవాత రాజకుమార్తె అతన్ని వేరొక పడకగదికి పంపేసి తాను తన పడకగదికి వెళ్లిపోయింది.

తన అన్న తప్పక ఆ ఉరుములకొండ వద్దకే వెళ్ళి ఏదో అపాయానికి గురి అయి ఉంటాడని చిన్నవాడు నిశ్చయించుకున్నాడు. అతను మర్నాడు ఉదయమే లేచి తన కత్తితీసుకుని, కుక్కను వెంట బెట్టుకుని, గుర్రమెక్కి కొండకు వెళ్ళాడు.

ముసలిమంత్రగత్తె ఎప్పటిలాగే కొండ మీద చెట్టుకింద రాతిపైన కూచుని ఉన్నది. మనిషి వస్తున్న అలికిడి విని, ఆ ముసలిది తల ఎత్తిచూసి ఆశ్చర్యంతో కొయ్యబారి పోయింది. అదేమనిషి, అదేకత్తి, అదేగుర్రం,

అదేకుక్క! తన గుహలో ఒకసారి రాయి అయిపోయినమనిషి తిరిగి యథాప్రకారంగా కావటం ఆ ముసలిది ఎరగదు.

చిన్నవాడు ముసలిదాని మొహాన కలవర పాటు చూసి, క్షణంలో దాని నైజం గ్రహించాడు. తన అన్నను అదిచూసి ఏదో చేసిందని రూఢిచేసుకుని, అతను కత్తిదూసి ముసలిదానిమీదికి లంఘించి, "పిశాచమా, మా అన్నను రాయిచేశావా?" అన్నాడు.

కత్తిమొన రొమ్ములమీద తగిలేసరికి ముసలిదానికి పైప్రాణం పైనే పోయినట్టయింది. "మీ అన్నను బతికిస్తాను! నన్నేమీ చెయ్యకు!" అన్నది.

"మా అన్నను ఈ క్షణం బతికించు!" అన్నాడు చిన్నవాడు.

"ఇక్కడే ఉండు. నేను అతన్ని పంపిస్తాను!" అన్నది ముసలిది. ఆమె వెళ్లి పెద్దవాడితోసహా తిరిగి వచ్చింది. అతనితోబాటు గుర్రమూ, కుక్కాకూడా ఉన్నాయి.

"బతికి పోయావు, పో!" అన్నాడు చిన్నవాడు. ముసలిది వెళ్ళిపోయింది.

పెద్దవాడు తన తమ్ముడితో జరిగినదంతా చెప్పి, అతను చెప్పినదంతా విన్నాడు.

"ఏమైతేనేం? మన ఆపద గడిచింది. ఇక పోదాం పద!" అన్నాడు చిన్నవాడు.




కాని పెద్దవాడు కదలలేదు. "తమ్ముడూ, నాలాటి అభాగ్యులు ఆ గుహలో ఇంకా ఎన్నో వందల మంది ఉన్నారు. వారినికూడా రక్షించటం మనవిధి!" అన్నాడతను.

"ఈ సంగతి ముసలిది ఉండగానే చెప్పలేకపోయావా? ఇప్పుడేమిటి ఉపాయం?" అన్నాడు చిన్నవాడు.

ఇద్దరూ అక్కడ చెట్టుక్రింద కూచుని దీర్ఘంగా ఆలోచించారు. పెద్దవాడికి అకస్మాత్తుగా ఒక ఆలోచన తట్టింది.

"ముసలిది ఒకరకం ఆకులు చేతపట్టుకుని ఆ గుహలోకి వస్తుంది. ఆ రోజు చూశాను, ఇవాళ మళ్లీ చూశాను. ఆ ఆకు

లలో ఏదో మహిమ ఉండాలి. వాటిని చేతపట్టుకున్నవారు గుహలోకి వెళ్ళినా రాయి కారనుకుంటాను!" అన్నాడతను తమ్ముడితో.

తమ్ముడికికూడా ఇది నమ్మదగినదిగా తోచింది. ఇద్దరూ కలిసి ఆ ఆకులు పోగు చేసి పట్టుకుని గుహకు బయలుదేరారు.

వారు గుహలోకి ప్రవేశించినా రాళ్లు కాలేదు. అంతేకాదు, ఆ ఆకులు తగిలించే సరికి ప్రతి రాతివిగ్రహమూ మనిషిరూపం పొందసాగింది. ఈ విధంగా అన్నదమ్ము లిద్దరూ అక్కడ శిలలైపోయిన వారినంద రినీ బతికించి గుహబయటికి పంపారు.

తరవాత చిన్నవాడు ముసలిదాన్ని పట్టుకుని జరజరా బయటికీడ్చి తన కత్తితో చంపబోయాడు. అన్న అతనికి అడ్డుపడి, "తమ్ముడూ, దానికి తగిన శిక్ష చంపటం కాదు. సరిఅయిన శిక్ష నేను చేస్తాను చూడు!" అంటూ ముసలిదాని చేతిలో ఉన్న ఆకులు లాగేసి బలవంతంగా గుహలోకి తోశాడు. గుహలో పడిపోతూనే ముసలిది రాయి అయిపోయింది.

తరవాత అన్నదమ్ము లిద్దరూ కలిసి, తాము బతికించిన వారిని వెంటబెట్టుకుని నగరానికి వెళ్లారు. రాజుగారు ఇద్దరు అల్లుళ్ళను చూసి నిర్ఘాంతపోయాడు. మిగిలినవారు కూడా తమ కళ్లను తాము నమ్మలేకపోయారు.

గుహనుంచి బతికివచ్చిన వారందరూ పురుషులేగాని, వారిలో ఒక రాజువెంట ఆయన కుమార్తెకూడా ఉన్నది. ఆ పిల్లను చిన్నవాడు పెళ్లాడాడు. తరవాత అన్న దమ్ములిద్దరూ ఆ నగరంలోనే ఉండి తమ తలిదండ్రులను పిలిపించుకున్నారు.

పెద్దవాడు కాలక్రమాన ఆ నగరానికి రాజయాడు. అతను తన తమ్ముణ్ణి మంత్రిగా చేసుకున్నాడు. వారు చాలా కాలం సుఖంగా జీవించారు.





# ఇంగితంలేని ఎలుగుబంటి

కుందేలు ఎలుగుబంటిని నక్కగారి దొడ్లో ఉచ్చుకు వేల్లాడదీసి పారిపోయిన చాలా కాలానికి వారిద్దరూ తలవని తలంపుగా ఒక దారిన పోతూ కలుసుకున్నారు.

ఎలుగుబంటి కుందేలు కేసి తీక్ష్ణంగా చూసింది. కుందేలుమాత్రం ఇదేమీ గమనించనట్టు, అమాయికంగా, "ఎలుగుబంటి మామా, ఎన్నాళ్లకు కనిపించావు? అత్తయ్యా, మరదలుపిల్లా కులాసాగా ఉంటున్నారా ?" అని అడిగింది.

అత్తయ్యంటే ఎలుగుబంటి భార్య, మరదలుపిల్ల అంటే ఎలుగుబంటి కూతురు.

లోపల మండిపోతున్నప్పటికీ ఎలుగుబంటి పైకి సౌమ్యంగానే, "అంతా బాగానే ఉన్నాం," అన్నది.

ఆ తరవాత ఇద్దరూ సఖ్యంగా ఉన్నట్టు పక్కపక్కనే నడవసాగారు. ఎప్పుడు అమాంతం మీదపడి గొంతు పిసికేస్తుందోనని కుందేలు ఎలుగుబంటిని ఒక కంట కనిపెడుతూనే ఉన్నది.

ఇద్దరూ కొంతదూరం నడిచాక కుందేలు, "అన్నట్టు, మామా, నీకొక చిన్న సహాయం చేద్దామనుకున్నాను, నువు కనిపించకనే పోతివి !" అన్నది.

"ఏమిటా సహాయం ?" అన్నది ఎలుగుబంటి అనుమానంగా.

"మరేం లేదు. మా తోపులో గుల్లచెట్టు మీద పోతంత తేనెతుట్టె ఉన్నది. దాన్ని తెచ్చుకుంటివా మీకుటుంబానికి నెలరోజులు నిరాక్షేపణగా వెళ్లిపోతుంది," అన్నది కుందేలు.

"గుల్లచెట్టుమీదనా ?" అన్నది ఎలుగుబంటి ఆశ్చర్యంగా.

"అవును. అది పైనుంచి కిందిదాకా గుల్లే, బోదెలో ఒక తొర్ర ఉన్నది. దానిలో నుంచి దూరి పైకి పోతివా, నేను పొడు

టి. శంభుదాసు

గాటి గడతో తేనెతుట్టెను నీకేసి తోస్తాను. నువు అమాంతం దాన్ని పట్టుకుని దిగి రావచ్చు," అన్నది కుందేలు.

"అయితే అలస్యమెందుకూ పద!" అన్నది ఎలుగుబంటి.

ఇద్దరూ కలిసి కుందేలు తోపును సమీపించారు.

"అదుగో తేనె వాసనా!" అన్నది ఎలుగుబంటి.

"అదుగో గుల్లచెట్టూ!" అన్నది కుందేలు, ఎగురుతూ.

"అదుగో తేనెపట్టూ!" అన్నది ఎలుగుబంటి వుత్సాహంగా.

"అదుగో బోదెలో తొర్రా!" అన్నది కుందేలు.

కొంచెం సేపటికల్లా, కుందేలూ, ఎలుగుబంటీ చెట్టును సమీపించాయి.

"చూడు, మామా! ఆ తొర్రలోనుంచి లోపలికి దూరి పైకి వెళ్ళు. ఈ లోపుగా నేను గడతో తేనెతుట్టెను నీకేసి తోస్తాను!" అన్నది కుందేలు.

సరేనని ఎలుగుబంటి చెట్టు తొర్రలో తల దూర్చింది.

ఈ లోపుగానే కుందేలు గడతో తేనెతుట్టెను పొడిచి తేనెటీగలను రేపింది.

అవి చెట్టు తొర్రకుండా దిగి వచ్చి ఎలుగుబంటి తలను చెడకుట్టసాగాయి.

"అయ్యో, అయ్యో మామా! తేనె అంతా కిందకు కారిపోతున్నది, తాగెయ్యి, మామా! తాగెయ్యి," అని కుందేలు అరవసాగింది.

ఎలుగుబంటికి తేనె ఎక్కడా కనపడ లేదు గాని, తేనెటీగలు చెడకుట్టటంచేత తల అంతా వాచి చెట్టుతొర్రలోనుంచి బయటికి రాకుండా ఇరుక్కుపోయింది.

"తల లావెక్కిన మామకు

తెలియదు తేనె మజా!" అని పాట బాడుతూ కుందేలు చెట్టూచుట్టూ నృత్యం చెయ్యసాగింది.



# ఆస్ట్రేలియా నెమలి

ఇది ఒక అపూర్వమైన పక్షి. ఇది ఆస్ట్రేలియాలో తప్ప ప్రపంచంలో మరెక్కడా లేదు. నెమలికిలాగే దీనికికూడా అందమైన పింఛం ఉన్నది. మగపక్షి ఆ పింఛాన్ని విప్పి ఆడుతూ అతి శ్రావ్యంగా పాడుతుందికూడా. దీని పింఛం "లైర్" అనే గ్రీకువీణ ఆకారంలో ఉండటంచేత దీనికి "లైర్ బర్డ్" అని పేరు పెట్టారు.

నాగరిక ప్రపంచానికి ఈ పక్షి మొదటగా కనిపించినది **1798** లో. తరవాత దీనికోసం చాలామంది అన్వేషించారు గాని చూసినవారు బహుకొద్ది. అయితే చాలామంది దాని గానం విన్నారు. ఈ పక్షి పింఛం విప్పినప్పుడు గాలిలో ఈకలు కదలటంవల్ల పాట వస్తుందని చాలా మంది నమ్మారుకూడా.

ఈ పక్షి మనం ఇళ్లలో పెంచుకునే కోళ్ల ప్రమాణంలో ఉంటుంది. దాని అందమైన తోకలో మొత్తం **16** ఈకలు నిడుపైనవి ఉంటాయి. పింఛానికి రెండు చివరలా ఉండే ఈకల నిడివి సుమారు **30** అంగుళాలు. వీటిమధ్యగా **12** ఈకలు, ఈనెలు గలవి, ఉంటాయి. ఇవిగాక రెండు చువ్వలలాటి ఈకలుకూడా పింఛంలో ఉన్నాయి.

ఈ పక్షులలో రెండు రకాలున్నాయి. ఒకదాని తోక చాలా పెద్దది. రెండవదానిది చాలా చిన్నది. చిన్నతోక గలదాని శరీరం రంగులు ఇంకా అందంగా ఉంటాయి.



రెండు జాతుల పక్షులూ మనోహరంగా పాడతాయి. అవి పాడటం ప్రత్యక్షంగా చూస్తున్నవారికి నయితం పాట ఎలా వస్తున్నదని ఆశ్చర్యం కలుగుతుంది. అతి మధురమైన స్వరాలు వాటి కంఠంనుంచి సునాయాసంగా వెలువడతాయి.

ఈ పక్షి పాడటమే గాక ఇతర పక్షులనూ, మృగాలనూ సయితం అద్భుతంగా అనుకరిస్తుంది. మగపక్షులే పాటకు ప్రసిద్ధి. అవి అన్ని కాలాలలోనూ పాడతాయిగాని, ఋతువులో వాటి పాట హెచ్చుగా వినిపిస్తుంది.

ఈ పక్షులకు ఋతువు మేనెలలో—వసంతారంభంతో—ప్రారంభమవుతుంది. ప్రతి మగపక్షీ ఒక చదరపు ఫర్లాంగుకు పైబడిన స్థలాన్ని తన క్షేత్రంగా చేసుకుని అందులో చిన్నచిన్న దిబ్బలు నిర్మిస్తుంది. దానికి పాడుతూ నాట్యంచేయ బుద్ధిఅయినప్పుడు మేత కూడా మాని ఆ దిబ్బలలో ఒకదానిదగ్గిరికి పరిగెత్తి పింఛం విప్పి గొంతెత్తుతుంది. ఆ పాట ఆలకించటానికి ఆడపక్షి చేరుతుంది.

ఈ పక్షులు ఆజన్మదాంపత్యం నిర్వహిస్తాయి. ఆడపక్షి చాలా పనిమంతురాలు. ఏప్రిల్, మే, జూన్ నెలలలో అది గూడు కడుతుంది. ఈ గూళ్లు నేలమీదా, చెట్ల పంగలలోనూ కూడా కనిపిస్తాయి. ఎత్తయిన చెట్లమధ్య, భూమికి ఎనభై అడుగుల ఎత్తున కట్టిన గూడు కూడా ఉన్నది. అయితే ఎక్కువ భాగం గూళ్లు భూమికి 3 లగాయితు 10 అడుగుల ఎత్తున, తరుచు ప్రవాహాలకు ఎగువగా ఉండే చెట్లమీద కనిపిస్తాయి.



జూన్, జూలై మాసాలలో—ఒక్కొక్కప్పుడు ఇంకా ఆలస్యంగాకూడా—ఆడపక్షి ఒకేఒక గుడ్డు పెడుతుంది. గుడ్డు బరువు సుమారు 2 ఔన్సులు లేక 5 తులాలు. దీన్ని ఉంచేచోట ఆడపక్షి తన శరీరంమీది ఈకలే మెత్తగా అమర్చుతుంది.

సరిగా నడిశీతాకాలంలో—మంచుపడే సమయాన—గుడ్డు పొదుగుతుంది. పిల్లను వెచ్చగా ఉంచటంకోసరం ఆడపక్షి చాలారోజులపాటు గూటిని అంటిపెట్టుకుని ఉంటుంది. ఒక వారం గడిచాక అది అవతలికి వెళ్ళి పిల్లకు కావలిసిన ఆహారం కష్టపడి తెస్తుంది.

అయిదారు వారాలు గడిచేదాకా పిల్ల గూడు విడిచి బయటికి రాదు. ఈ లోపుగా పిల్ల వేసే రెట్టలను తల్లిపక్షి తన ముక్కున కరుచుకుపోయి నదీ ప్రవాహాలలో పడవేస్తుంది. ఇలా చెయ్యటంవల్ల "శత్రువులకు" గూటివాసన తెలియరాదు.

సెప్టెంబరులో పిల్ల గూడు దాటి ప్రపంచంలోకి అడుగు పెడుతుంది. ఆ తరవాతకూడా ఒకవారం రోజులపాటు తల్లిపక్షి పిల్లవెంట ఉండి, దాన్ని గడ్డిచాటునో, దుంగచాటునో దాస్తూ, తానే దానికి ఆహారం పెడుతుంది. పిల్లకు పదినెలలు నిండినాకకూడా తల్లి అప్పుడప్పుడూ ఆహారం అందించటం చూసినవారున్నారు.

ఆడపక్షుల తోక చిన్నదిగా ఉంటుంది, మగదానంత ఆకర్షవంతంగా ఉండదు. ఎప్పుడైనా ఆడపక్షులుకూడా తమ పింఛం విప్పి ఆడటమూ, పాడటమూ జరుగుతుంది. కాని ఇందులోకూడా ఆకర్షణ తక్కువే.



సెప్టెంబరు నుంచీ మగపక్షికి పింఛం రాలిపోయి నాలుగు వారాలలో కొత్తపింఛం వస్తుంది. తోక లేని సమయంలో ఈ పక్షి తరుచు ఎగురుతుంది.

ఈ పక్షులు "అవిభక్త కుటుంబాలు" గా జీవిస్తాయి. కుటుంబాలకు కుటుంబాలే మేతకు బయలుదేరుతాయి. ఆరేడు పక్షులుకూడా కలిసి తిరగటం చూడవచ్చు. వాటిలో ఒకటి తల్లి, మిగిలినవి దాని పిల్లలు—గడిచిన ఏళ్లలో పుట్టినవి. తండ్రిపక్షి తన కుటుంబానికి సమీపంలోనే ఉంటుంది. అది మధ్యమధ్య మేత మాని గర్వంగా తన భార్యాబిడ్డలను సమీపించి, వాటిని చూసుకుని ఆనందించి, మళ్లీ మేత సాగిస్తుంది!

ఈ పక్షులకు ఆరేడేళ్ళు నిండేదాకా మగవీ, ఆడవీ ఒకలాగే ఉంటాయి. పింఛం ఏర్పడటంతో వ్యత్యాసం కొట్టవచ్చినట్టు తెలుస్తుంది. పింఛం రావటం ఒక ఏడాదిపాటు జరుగుతుంది.

ఈ పక్షులలో స్నేహభావం జాస్తి. కొన్ని పక్షులు ఏళ్లతరబడి సావాసం సాగిస్తాయి. దేని కుటుంబం దానికి ఏర్పడిన అనంతరం ఒకదాని దిబ్బకు ఒకటి చూడబోతుంది. స్నేహితులు కలుసుకున్నప్పుడు పరిగెత్తే ఆటలూ అవీ సాగుతాయి. అయిదు పక్షులు కలిసి ఆడటం కూడా చూసినవారున్నారు.

ఈ పక్షులు ఎంతకాలం బతుకుతాయో స్పష్టంగా తెలియదు గాని, మనుషులతో స్నేహంచేసిన "టిమొతీ" అనే పక్షి 25 ఏళ్ళు బతికింది.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

**1958 ఏప్రిల్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు**





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఫిబ్రవరి నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:— చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : శ్రీరాముని దయచేతను....

రెండవ ఫోటో : నారూఢిగ సకల జనులు నౌరా యనగా!

పంపినవారు : నందివాడ అమ్మాజమ్మ,

C/o. ఎస్. అప్పారావు, కాంపౌండరు, ఆగ్నేయ రైల్వే ఆసుపత్రి, వాల్తేరు R. S.

బహుమతిమొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒక రోజున దాసూ, వాసూలు షికారు వెళ్ళి, సూర్యాస్తమయ సమయంలో ఇంటికి తిరిగి వస్తున్నారు. 'టైగర్' వెనక ఎక్కడో మెల్లిగా నడిచి వస్తున్నది. ఆ సమయంలో ఒక కొంటె కుర్రాడు, దాసూ వాసూలను భయపెట్టేందుకు ఒక పొద చాటున దాక్కుని కీచుమంటూ అరవసాగాడు. ఆ అరిచేది దయ్యమో, వింత మృగమో అనుకుంటూ దాసూ, వాసూలు పరిగెత్తబోయే లోపల, 'టైగర్' వెనకగా వెళ్ళి ఆ కొంటె కుర్రాడిమీద పడింది. వాడు తారుకుని 'దయ్యం, దయ్యం!' అంటూ పరిగెత్తసాగాడు. అంతలో పొదచాటునుంచి బయటికి వచ్చిన 'టైగర్' ను చూసి, దాసూ వాసూలు పొట్టలు చెక్కలయ్యేలా నవ్వుకున్నారు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26—Controlling Editor: SRI 'CHAKRAPANI'




# చేర్మన్‌గారెక్కడ?







## ఆయన Parry's పారీస్ మిఠాయికోసం వెళ్లారు

ఆది ఆశ్చర్యం కాదు! పారీవారి మిఠాయి ఎంతో కమ్మగా, ఎంతో స్వచ్ఛంగా వుంటుంది కనుక దానిమీదికి మనస్సు పోకుండా నిగ్రహించుకోలేము.... నేడే పారీ మిఠాయి ఇంటికి తీసుకువెళ్లండి. మీ కుటుంబీకులందరికి పండుగగా ఉంటుంది.

పారీస్ కన్‌ఫెక్షనెరీ లిమిటెడ్ ★ మద్రాసు ★ వారి తయారీ.

PRS 93

ఏ విధమయిన అచ్చుపనులైనను
అతి చక్కగా...
అనుకొన్న గడువులో
మేము చేసి యివ్వగలము!

★

మా ముద్రణశాఖకు తోడుగా చిత్రకళాశాఖ,
బ్లాకు తయారీశాఖ, లితో-ఆఫ్‌సెట్
సంస్థలు సమకూడి వున్నవి.

★

ది బి. ఎన్. కె. ప్రెస్
(ప్రైవేట్) లిమిటెడ్
చందమామ బిల్డింగ్స్
వడపళని :: మదరాసు-26

ఫోన్: 88851—3 లైన్లు



చదవడం వల్ల
శక్తి క్షీణిస్తుంది...




పుష్టికరమైన ఆహారం పోయిన శక్తిని చేకూరుస్తుంది. తుషార్‌తో వండిన మామూలు వంటలు కూడా పుష్టిని చేకూర్చడంలో సాటిలేనివి.

# తుషార్
విటమిన్‌లుగల వనస్పతి

TI-1/56 తుంగభద్ర ఇండస్ట్రీస్ లిమిటెడ్, కర్నూలు

Worth any price

"And yet priced low"

Nutrine
SWEETS

ది న్యూట్రిన్ కన్‌ఫెక్షనెరి కంపెని
లిమిటెడ్, చిత్తూరు (ఆంధ్ర)

# రవి టాయ్‌లెట్స్‌ను వాడండి

## రవి గ్లిసరిన్ సోపు:

మీ అందమును వర్చస్సును కాపాడును.

## రవి వెజిటబుల్ హేరాయిల్:

మీ కేశములను విరివిగా పెంపొందించును.

## రవి స్నో:

మీ ముఖవిలాసమును అభివృద్ధి చేయును.




సోల్ ఏజంట్లు :

ది న్యూ స్టార్ & కంపెని,

తండియార్పేట : మద్రాసు-21

TIC 53a



**1936** వయస్సు 20 ఏళ్లే అయినా భార్య, ఉద్యోగం, హెర్క్యులిస్ సైకిల్ వుండడంచేత ఆ పట్టణంకెల్ల తను అదృష్టవంతుడననే గర్వం గంగాధరానికి వుండేది. యువకునికి ఇంకా తక్కువేమిటి?

**నేడు** ప్రపంచం ఎంతగా మారిందో అనేక ఏళ్లు గంగాధరాన్ని ఆఫీసుకు తీసికొని వెళ్లుతూ వచ్చిన నమ్మకమైన పాత హెర్క్యులిస్ ఇప్పుడు 20 ఏళ్లు గల అయన కుమారుని కాలేజీకి ప్రతి రోజూ తీసికొని వెళ్లుతున్నది.

## హెర్క్యులిస్ నిజానికి సైకిల్ కంటె ఎక్కువైనది; అది జీవిత భాగస్వామి




హెర్క్యులిస్ యజమానిని అడగండి. అది జీవితాంతం వుంటుందని ఆయన చెబుతాడు. దాదాపు 50 సంవత్సరాలుగా మేలురకం సైకిళ్ల ఉత్పత్తిలో అనుభవం గడించినవారి సహాయంతో సునిశితమైన ఈ హెర్క్యులిస్ సైకిల్ ఇప్పుడు టి. ఐ. సైకిల్స్‌వారి అత్యధునాతనమైన ఫ్యాక్టరీలో తయారు చేయబడుతున్నది. దాని అందం, మెత్తదనం, అతి తేలికగానే దానిని త్రొక్కడానికి వీలుండడం మీరు తప్పక మెచ్చుకుంటారు. మీరు కొనగలిగినవాటిలో హెర్క్యులిస్ బహుమేలైనది. అయినా దాని ధర సరసమైనదే.

మీ సైకిల్ మీద పెట్టుబడి - **హెర్క్యులిస్** మీరు ఖర్చు చేసే డబ్బుకు పూర్తివిలువనిచ్చే

ఇండియాలో ఉత్పత్తిదారులు: టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, మద్రాసు

మా పనితనమును
గురించి గొప్పగా
చెప్పటము కాదు

# అత్యుత్తమంగా

చేసి చూపుతాము

★

పోస్టర్లు
క్యాలెండర్లు
కార్టన్లు
లేబిల్సు
బుక్లెట్సు
ఫోల్డర్లు

అఫ్‌సెట్ ప్రింటింగులో ఏది కావలసినా సరే

మేలైన ముద్రణకు గుర్తు




## ప్రసాద్ ప్రాసెస్ (ప్రైవేట్) లి. మదరాసు - 26

బొంబాయి ప్రతినిధి కార్యాలయం:

లోటస్ హౌస్, మెరీన్ లైన్స్, బొంబాయి - 1.

ఫోన్ : 241162









పరిపూర్ణమైన
ముఖవర్చస్సునకు!

నేషనల్‌వారి
కాశ్మీర్ స్నో

ది నేషనల్ ట్రేడింగ్ కంపెని, బొంబాయి-2 ★ మదరాసు-1

అద్వితీయమైన నాణ్యము! అతి సరసమైన మూల్యము !!

FOR Costly PENS
Iris
INKS










ఐరిస్
సిరాలు

ఫౌంటెన్ కలములకు పేరెన్నిక కన్నవి.

1, 2, 4, 12, 24 ఔన్సుల ప్యాకింగులలో లభించును.

తయారుచేయువారు:

రీసెర్చ్ కెమికల్ లెబొరేటరీస్

మద్రాసు-4 ★ న్యూఢిల్లీ-1 ★ బెంగళూరు-3

విజయా వారి

రాబోవు హాస్యరస చిత్రము..

# అప్పుచేసి పప్పుకూడు

యన్.టి.రామారావు...సావిత్రి...జమున

యస్.వి. రంగారావు...రేలంగి

డైరెక్షన్... ప్రసాద్



నిర్మాతలు... నాగిరెడ్డి & చక్రపాణి...



బహుమతి
పొందిన వ్యాఖ్య

నారూఢిగ సకల జనులు నౌరా యనగా!

పంపినవారు:
ఎస్. అమ్మాజమ్మ - వాల్తేరు



రూపధరుడి యాత్రలు - 8